
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **సుందరయ్య విజ్ఞాన కేంద్రం** వారి వెబ్ సైట్: http://sundarayya.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## సుందరయ్య విజ్ఞాన కేంద్రం వారి వెబ్ సైట్:

## http://sundarayya.org/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## విజ్ఞాపన.

నేను 1907-వ సంవత్సరమున ఈ వివాహవయోదర్పణము—వివాహపద్ధతిని హిందీభాషలో నుంచి తెనుగు భాషకు మార్చినప్పుడు అందులో యున్నదున్నట్లు మార్చబడెను. ఆ పిమ్మట మఱియొక పెద్దగ్రంథము ననుసరించి కొంతసవరణములు కాబడెను. కాబట్టి యీశుద్ధాశుద్ధ పత్రము ఇంత యెక్కువగా ముగిసినది. మరియు పాఠకులు ఈ విషయమైయున్నను, ఇతరసామాన్య అచ్చుపొరబాటులున్న చూపినయెడల మరు ముద్రణములో సవరించుకొనుచున్నాడను. నన్ను క్షమించుటకై ప్రార్థితుల

ఇట్లు,

ఆర్య—టి. సి. రా.

ఓ౩మ్.

# వివాహవయోదర్పణము—

# వివాహపద్ధతి.

ఇది

ఆర్యధర్మోపదేశకు లగు

ఆర్య - నారాయణమూర్తిగారిచే

హిందీభాషనుండి తెనిగింపఁబడి

టి. సి. రామానుజులు నాయుఁడుగారిచే

వేలూరు - కుప్పుస్వామి మొదలారివారి

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు 2000 కాపీలు.

మదరాసు.

 1927. [వెల 4 అణాలు.

# విషయసూచిక.

విషయసూచిక - సంపూర్ణము.

---

# వివాహవయో దర్పణము.

ప్రియపాఠకులారా! మనలో "అష్టవర్షా భవేత్కన్యా నవవర్షాచ రోహిణీ దశవర్షా భవేద్గౌరీ హ్యత ఊర్ధ్వం రజస్వలా"

అను కల్పితశ్లోకమును పామరబుద్ధితో నమ్మబడు చున్నదిగాని వేదశాస్త్రపురాణములే వివాహవయస్సును గుఱించి యేమి చెప్పుచున్నవో మనము కొంచె మయి నను గమనించ లేదు. వేదమంత్రములు అనగా వివాహ మంత్రములను చూచి వానిఅర్థములను వివాహవిధులను గుఱించి పరీక్షించి చూచినయెడల యుక్తవయస్సు వచ్చిన స్త్రీపురుషులే వివాహసంబంధబంధమును చేసికొన వలయు నని సిద్ధాంత మేర్పడుచున్నది. ఇందుకు గల వేద ప్రమాణములును వివాహపద్ధతిలోని మంత్రములును చూడుడు.

మఱియు, "బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్. అను వేదవచనరీత్యా స్త్రీ తనబ్రహ్మచర్య

మును ముగించి, అనగా స్త్రీలు పదునారు సంవత్సరముల వరకు బ్రహ్మచర్యమాచరించి తరువాత మంచియువావస్థలోనున్నట్టిపతిని పొందవలయునని చెప్పబడియున్నది.

"కామమామరణాత్తిష్ఠేత్ గృహే కన్యర్తుమత్యపి। నచైవైనాంప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్" మను.

రజస్వలలైన కన్య ఆమరణాంతము వివాహము లేక యుండవచ్చునుగాని, గుణహీనుడగు మూర్ఖునకు యియ్య కూడదని అర్థము.

"త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీసతీ, ఊర్ధ్వంతు కాలాదేతస్మాత్ విందేతసదృశం పతిమ్" అనగా:

రజస్వల యయిన తరువాత మూడుసంవత్సరముల వరకు కన్య తండ్రియొక్క అనుమతిని ప్రతీక్షించి ఆతరువాత తనకు సమానమయిన గుణకర్మస్వభావములు గల పతిని వరించవలయును.

"పంచవింశే తతోవర్షే పుమాన్ నారీతు షోడశే। సమత్వాగత వీర్యౌతౌ జానీయాత్కుశలో భిషక్" శుశ్రుతము.



ఇరువదియైదు సంవత్సరములకు పురుషుడును పదునారుసంవత్సరములకు స్త్రీయును సమవీర్యము గలవారగుదురు.

అనగా ఆ తరువాతనే వారికి గర్భాధానము జరుగవలయునని శుశ్రుతకారుల అభిప్రాయము.

"ఊనషోడశవర్షాయా మప్రాప్తః పంచవింశతిమ్। యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే। జాతో వా నచిరంజీవేజ్జీవేద్వాదుర్బలేంద్రియః। తస్మాదత్యంతబాలాయాం గర్భాధానం నకారయేత్"

పదునారుసంవత్సరముల వయస్సుకు లోబడిన స్త్రీయందు, ఇరువదియైదు సంవత్సరములవయస్సుకు లోబడిన పురుషుడు గర్భాధానము చేసినయెడల అది నష్టమగును, లేదా అల్పాయువగు శిశువుజన్మించును, కొంతకాలము బ్రతికినను బలహీనుడై యుండును గాన బాల్యావస్థయందు గర్భాధానమును చేయరాదని తాత్పర్యము.

ధర్మశాస్త్రములలోను, వైద్యశాస్త్రములలోను, యెచ్చటను అతిబాల్యవివాహములకు ఆస్పదము లేనేలేదు. ఈ విషయమై కొన్నిపురాణములు అంగీకరించు

నని పౌరాణికులు చెప్పవత్తురు. పురాణములు ప్రమాణములుగా మేమంగీకరించువారముకాము అయినను పురాణములలో ననేకములు మాపక్షమే వహించి యున్నవని కూడా మేము చెప్పి యీక్రింద చూపుచున్నారము.

పురాణములలో ప్రతి వైవాహికచరిత్రలయం దెచ్చట చూచినను కన్యలను వర్ణించుటలో "పీనోత్తుంగకుచ" పీనోన్నతకుచస్థలీ" యని వర్ణింపబడినది. మఱియు సీత, ద్రౌపది, దమయంతి, రుక్మిణి మొదలయినవారి వివాహఘట్టములను పరీక్షించి చూచినయెడల వారు రజస్వలానంతరమే వివాహ మాడినట్లు విస్పష్ట మను చున్నది. ఉదాహరణముగా భారతమందలి లోపాముద్ర విషయమై చూడుడు.

"తాం యవ్వనస్థాం రాజేంద్ర శతం కన్యాః స్వలంకృతాః॥ దాస్యశ్శతంచ కల్యాణీ ముపతస్థు ర్వశానుగాః॥ యౌవనస్థామపి చతాం శీలాచార సమన్వితామ్। నవవ్రే పురుషః కశ్చిత్ భయాత్తస్య మహాత్మనః। వైదర్భింతు తథాయుక్తాం యువతీం ప్రేక్ష్యవై పితా। మనసా చింతయామాస కస్మైదద్యా మిమాం సుతామ్"



సీతారామచంద్రవివాహమునందు:—

కపోలే జానక్యాః కరికలభదంతద్యుతిముషి స్మరస్మేరం గండోడ్డమరపులకం వక్త్రకమలం। ముహుః పశ్యన్ శృణ్వన్ రజని చర సేనా కలకలం జటాజూటగ్రంథి రచయతి రఘూణాం పరివృఢః.

ఇత్యాది వివాహవర్ణనలయందు వధూవరులయొక్క యౌవనలక్షణములు పరిష్కారముగా వర్ణింపబడినవి.

స్కాందపురాణమున బ్రహ్మోత్తరఖండమందు:—

అనార్త సంభవః కశ్చి న్నామ్నా వేద రథో ద్విజః॥ తస్యైవం వర్తమానస్య బ్రాహ్మణస్య గృహాశ్రమే। బభూవ శారదా నామ్నా కన్యా కమలలోచనా। తాం రూపలక్షణోపేతాం బాలాం ద్వాదశహాయనామ్। యయాచే పద్మనాభాఖ్యో మృతదార శ్చరద్విజః.

అనగా; అనార్తదేశమందు వేదరథు డను బ్రాహ్మణు డుండెను. అతనికి పండ్రెండు సంవత్సరముల వయస్సు గల శారదాయను కన్యకను పద్మనాభుడనువాడు గ్రహించెనని చెప్పియున్నది. ఇచ్చట పదిసంవత్సరముల తరువాత కన్యను చూచిన మాతాపితాదులు నరక

మనుభవింతురన్న వాక్య మేమయినది? మఱియు అష్ట వర్షములు మొదలు దశవర్షములలో వివాహము చేయవలెనను విధి యేమయి పోయినది?

రుక్మిణినిగుఱించి వినుడు:—

“తాం దేవమాయామివ వీరమోహినీం సుమధ్యమాం కుండలమండితాననామ్। శ్యామాం నితంబార్పిత రత్నమేఖలాం వ్యజత్స్తనీం కుంతల శంకితేక్షణామ్ శుచి స్మితాం బింబఫలాధరద్యుతిం శోణాయమానద్విజ కుందకట్మలామ్। పదా చలంతీం కలహంసగామినీం సృజత్కలా నూపురధామ శోభితామ్॥

ఇచ్చట “శ్యామా” అనగా పదునారు సంవత్సరముల వయస్సుగలదని స్పష్టముగ నున్నది “వ్యజత్స్తనీం” శబ్దము నయితము యవ్వనమును బోధించుచున్నది. ఇందువలన పూర్వకాలమందు పురాణకల్పనసమయమందు సహితము యువావస్థలోనే వివాహములు జరుగుచుండినట్లు తెలియుచున్నది.

మఱియు ప్రసిద్ధపండితుల అభిప్రాయములను చూడుడు



“అథ దృష్టరజస్కాయాః కన్యాయాః ఏవ వివాహః శ్రుతి స్మృతి బోధితః, ప్రాచీన వ్యవహారానుగతశ్చ, న పునరదృష్టరజస్కాయాః, న క్వాపి వేదే స్మృతౌ వా దృష్టరజస్కాయాః పాణి పీడనే సంప్రదానేవా దోషో విహితః। ప్రత్యుత వైవాహిక మంత్రాదితః సర్వసూత్ర గ్రంథీయాది సంభోగకాలవిధితః, స్మృతీనాం సాక్షాద్వచనతశ్చ దృష్టరజస్కాయాః సంప్రదానే పాణిగ్రహణే చ విధిః ప్రతీయతే స్ఫుటమ్॥ సత్యవ్రతసామశ్రమీ॥

అనగా స్త్రీ రజస్వల యయిన తరువాతనే వివాహమునకు యోగ్యమగునని వేదము, స్మృత్యాదులవలన సిద్ధమగుచున్నది. రజస్వలకానిది వివాహము చేయగూడదు, మఱియు రజోవతి యయినకన్యను దానమిచ్చుట వలనను, పరిగ్రహించుటవలనను దోషము గల దని యెచ్చటను వేదాదిస్మృతులలో బొత్తిగా లేదు. వివాహమంత్రములు మొదలుకొని సమస్తసూత్రములందును రజోవతి యయిన కన్యను పాణిగ్రహణము చేయవలెనని స్పష్టముగా తెలియుచున్నదని అర్థము.

## ఇందుకు వేద ప్రమాణములు.

సోమః ప్రథమో వివిదే గంధర్వో విదద ఉత్తరః । తృతీయో అగ్నిష్టే పతిస్తు రీయస్తే మనుష్యజాః.

హే స్త్రీ! మొదట చంద్రుడు నీకు పతియయ్యెను; తరువాతి రెండవవాడు గంధర్వుడు; మూడవవాడు అగ్ని; నాల్గవవాడు మనుష్యుడు నీకు పతి యయ్యెను. అని ఋగ్వేదమందును మఱియు,

సోమో దదద్ గంధర్వాయ గంధర్వో దదదగ్నయే,
రయించ పుత్రాంశ్చాదా దగ్నిర్మహ్యమథో ఇమామ్.
అనగా:—

చంద్రుడు గంధర్వున కిచ్చెను; గంధర్వుడు అగ్నికి యిచ్చెను; ఇప్పుడు అగ్ని నాకు యిచ్చుచున్నాడు. ఇదేరీతిగా అత్రిస్మృతియందు "పూర్వం స్త్రియః సురై ర్భుక్తాఃసోమ గంధర్వవహ్నిభిః భుంజతే మానవాః పశ్చా న్నతా దుష్యంతి కర్హిచిత్" అని చెప్పబడినది.

ఈ మంత్రములలో నొక సందేహశేషము గలదు. యేమనగా యే యే వయస్సువరకు యెవరెవరు భోగిం



చిరి. యనుటకు గోభిలాచార్యపుత్రుడు గృహ్య సంగ్రహగ్రంథములో స్పష్టపరచి యున్నాడు.

వ్యంజనైస్తు సముత్పన్నైః సోమోభుంజీత కన్యకామ్। పయోధరైస్తు గంధర్వా రజనాగ్నిః ప్రకీర్తితః

ఇప్పుడు రజస్వల యయిన తరువాతనే వివాహము చేయవలె నని విస్పష్టమయ్యెను కదా? ఇంతియ గాక మనువుకూడ:—

"దేవదత్తాం పతి ర్భార్యాం విందతే నేచ్ఛయాత్మనః" అనగా దేవతులచేత భార్యాదానము చేయబడు నని తాత్పర్యము. మఱియు అశ్వలాయనగృహ్యసూత్రము చూడుడు:—

అత ఊర్ధ్వమక్షారలవణాశినౌ బ్రహ్మచారిణావలంకు ర్వాణావధఃశాయినౌ స్యాతాంత్రిరాత్రం ద్వాదశ రాత్రం సంవత్సరంవా॥

### ఆపస్తంబ గృహ్యసూత్రమ్:—

అక్షార లవణాశినౌ బ్రహ్మచారిణా వలంకుర్వాణా వధశ్శాయినౌ స్యాతామత ఊర్ధ్వం త్రిరాత్రం ద్వాదశ రాత్రం సంపత్సరంచ.

కాత్యాయనగృహ్యసూత్రమ్:—

అక్షార లవణాశినౌ స్యాతామధః శయీయాతాం సంవత్సరం నమిథున ముపేయాతాం ద్వాదశరాత్రం షడ్రాత్రం త్రిరాత్ర మంతతః.

ఇట్లు యెన్నియో పరమప్రమాణములు గలవు. ఈ సూత్రముల కర్థ మేమనగా:— వివాహానంతరము వధూవరులు ఉప్పు కారములను భక్షించక మూడు (3) రాత్రులు గాని, పండ్రెండు (12) రాత్రులు గాని, (1) ఒక సంవత్సరము గాని బ్రహ్మచర్యవ్రతధారణతో భూమిమీద శయనించి ఆ తరువాత సంగమము చేయవలయు నని తాత్పర్యము. ఇందువలన రజస్వలకాని కన్యలకు వివాహమైనప్పుడు మూడవరాత్రికే సమాగమ మెట్లు ఘటించును. అట్లు ఘటింపదు గనుక రజస్వలానంతరమే వివాహవిధి చేయవలయును. మఱియు,

ప్రాగృతోః కన్యాయా నదానమ్, ఋతుదర్శనేపి నవద్యాత్, యావత్ గుణవాన్ వరో నప్రాప్తః.

మేధాతిథి రజోదర్శనమునకు పూర్వము కన్యాదానము చేయకూడదు. ఋతుదర్శనమయిన తరువాతను



యెంతవరకు గుణవంతుడగు వరుడు దొరకడో అంతవరకు కన్యాదానము చేయకూడదు అని మేధాతిథులు వ్రాసియున్నారు. మఱియు,

వివాహే వితతే తంత్రే హోమే కాలే ఉపస్థితే। కన్యాయా ఋతు రాగచ్ఛేత్ కథం కుర్వంతి యాజ్ఞికాః॥ అనగా వివాహకార్యమును ప్రారంభించిన తర్వాత హోమసమయమందు కన్య ఋతుమతి యైన యెడల యజ్ఞకర్త లేమి చేయవలెనని ప్రశ్న. ఇందుల కుత్తరము.

స్నాపయిత్వా తతః కన్యా మర్చయిత్వా యథావిధి।
అంజలీ మాహుతిం హుత్వా తత స్తంత్రం ప్రవర్తతే॥

ఇతి మంజరీకారః.

కన్యకకు స్నానము చేయించి అలంకరించి యథావిధిగా అంజలీఆహుతి చేయించి తరువాత క్రమముగా వివాహకర్మ మాచరించవలయును.

ఇందుకు మంత్రము.

ఓం భగాయ స్వాహా, ఇదం భగాయ ఇదన్నమమ, ఇత్యాది అంజలీ ఆహుతి యియ్యవలెను.

బ్రహ్మపురాణమందు:—

వింశత్యబ్దా యదా కన్యా వస్తవ్యం తత్ర నైత్ర్యహమ్ అత ఊర్ధ్వ మహోరాత్రం వస్తవ్యం సంయతేనవై.

ఇందువలన పురాణసమయమందు సయితము (20) ఇరువది సంవత్సరములపైన వివాహమగుచుండె నని యేర్పడు చున్నది.

ఇట్లుండగా అతిబాల్య వివాహ వ్యాపకమునకు కారణ మేమని మన మాలోచింప వలసియున్నది. 1881-వ సంవత్సరమున పునహాపట్టణమందు జరిగిన బాల్య వివాహ నిరసన సభలోని పండితులు బాల్యవివాహమునకు మహమ్మదీయుల పరిపాలనమే కారణ మనియును, మహమ్మదీయులు పెండ్లి కాని కన్యలను చెఱపట్టుటకు ప్రారంభించగా అప్పటి శ్రీనాథాదికవీశ్వరులు అతిబాల్య వివాహమును ప్రోత్సాహపరచినట్లు యనేక (దాఖలా) దృష్టాంతములతో సిద్ధాంతపఱచినట్లు మనమును నమ్మ వలసి యున్నది.

ఆపస్తంబ ఆశ్వలాయన గోభిల సూత్రములును,



వేదములును స్మృతులును పురాణములును అతిబాల్య వివాహమును గర్హించు చున్నవి.

శ్లో॥ వివాహాది కర్మగణో య ఉక్తో గర్భాదానం శుశ్రుమ యస్య చాంతే ఇత్యాది వచనములవలన గర్భాధానముతో గాని వివాహము పూర్తి కానేరదు.

శాస్త్రముల మాట యటుండనిచ్చి పూర్వమందు లేకనేయుండి నడుమ వచ్చిన ఈ దురాచారమును నిష్పాక్షిక బుద్ధితో విమర్శించినయెడల బాల్యవివాహముల వలన దేశమునకు మితి మీఱిన యనర్థములు సంభవించి యున్నవనియు సంభవింపబోవు ననియు తోచక మానదు ఇప్పుడక్కడక్కడ కొందరు సభలు చేసి ఈదురాచారమును మాన్ప బూనియున్నారు. మే మొక్క విషయముమాత్ర మిచ్చట విన్నవించు చున్నారము. శ్రీ సచ్చిదానందస్వరూపుడు నగు ఆ పరమేశ్వరుడు తన రాజ్యమగు ఈ ప్రపంచమునకు తనయాజ్ఞారూపమగు చట్టము అనగా వేదమును దయచేసియున్నవాడు. భగవద్దత్తమైన యా వేదమును, అందలి సిద్ధాంతములును మనము అనాదరణ చేసినందుననే మనకీ దుఃఖప్రాప్తి

సంఘటితమై యున్నది. గాన మనము వేదభగవానుల చెప్పినచొప్పున తప్పక నడుచుకొన్నయెడల మనకు సుఖప్రాప్తియు ముక్తియు లభించును, గాన నో పాఠకులారా! మీరు ఈశ్వరుని ముఖమును చూచి పుత్రులకు వెఱవక పరోపకారచింత గలవారలై మీసంతానములకు చేయఁబోవు అతి బాల్య వివాహములను మానుకొనుడు. మీరు ఆచరించి మీ మిత్రులకును మీతరువాతివారికిని మార్గదర్శకులు గండు.

ఇట్లు భవదీయసుహృద్,

ఆర్యధర్మోపదేశక.

ఓ౩మ్.

# వివాహ పద్ధతి.

ఇప్పటి అవైదికకాలమునందు వివాహ పద్ధతులు మిక్కిలి తలక్రిందులై పోయినవి. ఈ వైవాహికములు వేదవిరోధమైనందున లోకమునందు దుఃఖమధికమై పోయినది. భగవంతుని యాజ్ఞ మీరినప్పుడు దుఃఖమెట్లు తప్పును? చట్టములకు విరోధముగా ప్రవర్తించినవారు తప్పక శిక్షకు పాత్రులు గదా!

వివాహ మనగా పూర్ణబ్రహ్మచర్యవ్రత మవలంబించి విద్యావంతులై వయోవంతులై అన్నివిధముల సమాన శుభగుణకర్మస్వరూపులై పరస్పరప్రీతియుక్తులై రెండవది యగు గృహస్థాశ్రమయోగ్యులై యుండు వధూవరులు అనఁగా స్త్రీపురుషులు తా ముభయులు నిర్దోషముగా గృహస్థధర్మమును పూర్తి చేయుటకై పరస్పరసహాయము కొరకై సంతానోత్పత్తికై వేదప్రమాణ వచనముల యుక్తముగా చేసుకొను యొక యొడంబడిక.

దీనికే వేదమందు వివాహ మనిపేరు. "సార్వకాల మేకే వివాహమ్" అను ఆశ్వలాయనసూత్రప్రకారము అనుకూలమైనకాలమంతయు వివాహయోగ్యమైనది, అయితే ముహూర్తము కావలెనన్న అనుకూలమై ప్రతికూలము లేమియు ఘటింపక యుండుకాలమే సుముహూర్త మని కొందరు విద్వాంసులును చెప్పుదురు. అంతియెకాని చెడుదినము లని మంచిదినము లని చెప్పుట కల్పితము. ఉత్తరాయణ శుక్లపక్షము వివాహాది సంస్కారములకు శుభకాల మని కొన్నిసూత్రములందు గలదు. ఈ దినములు మానవులకు అన్నివిధముల ప్రసన్నమై యుండునని తాత్పర్యము.

స్త్రీలకు బ్రహ్మచర్యము 16 సంవత్సరముల వరకును, పురుషులకు బ్రహ్మచర్యము 24 సంవత్సరముల వరకును విధి గనుక అంతకులోపల వివాహము చేయుట వేదవిరోధము. మనుస్మృత్యాది ధర్మశాస్త్రములు చూడుడు.

'అష్టవర్షా ద్భవే త్కన్యా' అను ఇత్యాదిశ్లోకములు వేదవిరోధములు త్యాజ్యములు గనుక సుఖమును



ధర్మార్థకామమోక్షములును గోరువారు వేదవిధుల ననుసరింపవలయును. వేదోక్తసంస్కారములను శూద్రాదులు ఆచరించకూడ దని యొకపామరవార్త మనలో వ్యాపించియున్నది. వేదశాస్త్రజ్ఞానములేని మూఢులు దీని నంగీకరింతురుగాని విద్వాంసు లంగీకరింపరు. ఇప్పుడు ప్రతివారును వేదోక్తవిధుల ననుసరించియే చేయుటకు ప్రారంభించి యున్నారు. అదియే యుత్తమ మయిన పక్షము గాన మేము వివాహపద్ధతిని క్రమముగాను, మంత్రయుక్తముగాను లోకోపకారార్థమై వ్రాయుచున్నాము.

వివాహకర్మ చేయుటకు పూర్వ మీక్రింది విషయములు గమనించవలయును.

1. యజ్ఞదేశము.
2. యజ్ఞశాల.
3. యజ్ఞకుండము.
4. యజ్ఞసమిధ.
5. హోమద్రవ్యములు.
6. యజ్ఞపాత్రములు.
7. స్థాలీపాకములు.

* ఒక్కొక్కసారి 8 అంగుళములు గల 8 సమిధలనుచేర్చి నేతిలో ముంచి అగ్నిలో వేయవలయును. అట్లు 16 ఆహుతులకు తక్కువ కాకుండ యియ్యవలయును ఎక్కువయెన్నియైనను ఇవ్వవచ్చును.





1. అధ్వర్యుడు (సమిధలనుండియు, భూమి పైభాగము నుండియు జీవహింస జరుగకయుండుటను చూచుకొని యుండువారు). 1. అధ్వర్యుడు. ఉత్తర ముఖముగా కూర్చుండ వలయును.

2. బ్రహ్మ (యజ్ఞకార్యము సాంగముగ జరుగుచుండు దానిని గమనించువారు. 2. బ్రహ్మ. పడమర ముఖముగా కూర్చుండ వలయును.

3. యజమానుడు (లేక వేదగానము జేయు నుద్గాత లేక పౌరోహితుడు). 3. యజమానుడు లేక పౌరోహితుడు దక్షిణముఖముగా కూర్చుండవలయును.

4. ఘృతాహుతులిచ్చువారు (లేక నేతిని యజ్ఞగుండములో విడుచువారు.) 4. ఘృతాహుతు లిచ్చుహోత తూర్పు ముఖముగా కూర్చుండవలయును.

1. యజ్ఞదేశము:—పవిత్రముగాను, పరిశుద్ధ వాయు సంచారము గలదిగాను, యేవిధ మయిన ఉపద్రవములు లేనిదిగా నుండవలయును.

2. యజ్ఞశాల:— పదునారుమూరలకు తక్కువ గాకుండ చచ్చౌకముగాను, భూమి అశుద్ధముగా నున్న యెడల యెత్తుగా వేదిక నిర్మించవలయును. యజ్ఞవేదిక

సైన నీడ కలుగునంతటి పందిరి పత్రమంటపముచే అలంక
రింపవలయును. చతుర్దిక్కులకు † పల్లవ పతాకములు
కట్టవలయును. గోమయము మొదలయిన పరిశుద్ధ
పదార్థములతో శుభ్ర పరచవలయును.

3. యజ్ఞకుండము:— ఆహుతుల సంఖ్యనుబట్టి
యుండవలసి యుండును. సాధారణముగా వివాహకర్మ
లందు మొకమూరంత చౌకప్రమాణమును అందుకు
దగిన లోతును యుండుటే యుక్తమై యుండును.

4 యజ్ఞ సమిధలు:—మోదుగ, శమీ, అశ్వత్థ, మఱ్ఱి,
బిల్వము, మొదలయిన పవిత్రమగు సమిధలు యజ్ఞ
వేదికప్రమాణముగా త్రుంచి సిద్ధపరచవలయును.

5. హోమ ద్రవ్యములు:—కస్తూరి, కేసరి, అగరు,
చందన, యేలకి, జాజికాయ, జాపత్రి, మొదలగు సుగంధ
ద్రవ్యములును, పాలు, నెయి, ఫలములు, కందమూలాదులు
అన్నము, బియ్యము, గోధుమలు, మొదలయిన పుష్టి పదా
ర్థములును, శర్కర, ఖర్జూరము, ద్రాక్ష, మొదలగు మిష్ట
పదార్థములును, సోమలతాది మూలికలును, ఈ నాలుగు
విధములైన హోమద్రవ్యములు సిద్ధపరచుకొనవలయును.

---

† చిగురుటాకుల జండా లేక ధ్వజము.





## య జ్ఞ పా త్ర ల వి వ ర ము.

దేశకాలముల ననుసరించి పాత్రము లుపయోగించ వలయును. అయినను యజ్ఞపాత్రముల ఆకారములు పాఠకులకు తెలుపుచున్నారము.

‡ రి:—1. స్రువః (చిన్నగరిటె). 2 శమ్యాప్రాదేశ (పొడుగు గరిటె). 3. కూర్చ (కుంచెకోల). 4. ఖాండా(కత్తి). 5. ప్రాశిత్రహరణీ. ప్రమాని గిన్నెలు). 6. ఉపల (నూరెడు పైగుండ్రాయి). 7. శృతావదాన(ప్రాదేశమాత్రం) జుత్తెడు కొలతగల కవ్వము). 8. పాటిలా (పీట). 9. ఉలూఖల (ప్రమాను రోలు). 10. ముసల (రోకలి). 11. షడవత (జంట చదరపు గిన్నెలు) 12. ఉత్తరారణీ (అప్పడములు ప్రేల్చే చదరపురేకు తట్టు). 13. స్రుచ్ (బాహుమాత్రం) నిడుపాటి పెద్ద గరిటె). 14. అధరారణీ (తరచి నిప్పు పుట్టించెడు క్రిందిభాగపు దారువు). 15. ఓజలీ (పూరీలు చేయు కట్టె). 16. ప్రణీత (పిండివంట పెనము). 17. చాత్ర (కనక గొట్టపు దీకము). 18. పురోడాశ (యజ్ఞార్థమైన



పిండివంటపాత్ర). 19. అంతర్ధాన (వలయాకారమైన పై మూత కలిగిన నాలుగు పాదముల తట్టు). 20. పిష్టపాత్ర (జంటపిండిపాత్రము). 21. ప్రోక్షణి (తీర్థము ప్రోక్షించునది). 22. ఇడ (యజ్ఞసమయమందు భక్షణ పాత్రము). 23. శూర్ప (చేట). 24. ఉపవేశ (హస్తాకృతిగల గరిటె). 25. మూలేఖాత (నూరెడు క్రిందిఱాయి). 26. అంగోల్లా (తోసుకొనెడుకఱ్ఱ) గోకర్ణాకారము గలిగిన దండయుక్తమగు కొయ్యతో చేయబడినది). 27. అరణి (తరచి నిప్పు పుట్టించెడు కొయ్య). 28. పూర్ణపాత్ర (పెద్ద పాత్రము). 29. అద్రిం (మాను గుద్దలి).

7. స్థాలీ పాకములు:—మంటి కుండలో వండినవి.

## అ థ ఋ త్వి గ్వ ర ణ మ్.

యజమానోక్తిః:— ఓం ఆవసోః సదనే సీద) ఈ మంత్రము చెప్పి యజమానుడు ఋత్విజ్జులను కర్మ చేయుటకు ప్రార్థించ వలయును.

ఋత్విగుక్తిః:—(ఓం సీదామ) అని చెప్పి ఆసనములమీద కూర్చుండ వలయును.

---

‡ ఉత్తర దేశమందు (ఫర్కాబాద్ టౌను) పాత్రలమ్ము అంగళ్ళలో యజ్ఞపాత్రలు దొరకుచున్నవి.

యజమానోక్తిః:—(అహ మద్యోక్తకర్మకరణాయ భవంతం వృణే).

ఋత్విగుక్తిః:—(వృతోఽస్మి).

ఋత్విజుల లక్షణము:—విద్వాంసులుగాను, జితేంద్రియులుగాను, ధార్మికులుగాను, నాలుగువేదము లైనను, అథవా యొక వేదమైనను అర్థసహితముగా చదివినవాడును, పరోపకారియు, సుశీలుడును, అయి యుండవలెను. ఇట్టి లక్షణములు లేనివాడు, పురోహితుడు కానేరడు. పురోహితుడు వేదికకు పశ్చిమమందు తూర్పు ముఖముగా కూర్చుండ వలయును.

విధిః:—కన్య రజస్వల యైన నాల్గవ దినమందు పరిశుద్ధయై అయిదవ దినమందు మరల స్నాన మాచరించి సిద్ధమై యుండవలయును, యేరాత్రి దినమందు గర్భాధానము నిశ్చయము చేయబడి యుండునో ఆ దినమే యావత్తు సామగ్రిని సిద్ధపరచుకొని వివాహకర్మ మాచరించవలయును. గర్భాధాన సమయమునకు సరిగా వివాహకర్మ ముగియునట్లు కర్మ ప్రారంభింపవలయును.

"ఓం కామదేవతే నామమదో నామాసి సమాన యాముం సురాతే అభవత్ పరమత్ర జన్మాగ్రే తపసో



నిర్మితోఽసి స్వాహా॥ ౧॥ ఓమ్ ఇమం త ఉపస్థం మధునా సంసృజామి ప్రజాపతే ర్ముఖమేతద్ ద్వితీయం । తేన పుంసోఽభిభవాసి సర్వానవశాన్వశిన్యాసి రాజ్ఞిస్వాహా॥ ౨॥ ఓం అగ్నిం క్రవ్యాదమకృణ్వన్ గుహానాః స్త్రీణా ముపస్థ మృషయః పురాణాః తే నాజ్యమకృణ్వాంశ్శృంగం త్వాష్ట్రింత్వయి తద్దధాతు స్వాహా॥ ౩॥

ఈమంత్రముల నుచ్చరించుచు వధూవరులు స్నానము చేసి శుద్ధ వస్త్రములను ధరించి వచ్చి పూర్వాభిముఖముగా కూర్చుండవలయును.

"ఓం అమృతోపస్తరణ మసి స్వాహా॥ ౧॥
ఓం అమృతాపిధాన మసి స్వాహా॥ ౨॥
ఓం సత్యం యశః శ్రీ ర్మయి శ్రీః శ్రయతాంస్వాహా"

అను మూడుమంత్రములతో యజ్ఞము చేయుటకు కూర్చుండినవారందరు ఒక్కొక్కమంత్రముతో నొక్కొక్కసారి మూడుఆచమనములు చేయవలయును.

"ఓం వాఙ్మ ఽఆస్యే ఽస్తు" ఈ మంత్రముతో కుడిచేతితో నీటినిముట్టి మరల ముఖమును అందఱును ముట్టుకొనవలయును.

"ఓం న సోర్మే ప్రాణోస్తు" అలాగే ముక్కు రంధ్రములను అందుకొని ముట్టుకొనవలయును.

"ఓం అక్ష్ణోర్మే చక్షు రస్తు" రెండు కన్నులను అందుకొని ముట్టుకొనవలయును.

"ఓం కర్ణయోర్మే శ్రోత్ర మస్తు." రెండు చెవులను అందుకొని ముట్టుకొనవలయును.

"ఓం బాహ్వోర్మే బల మస్తు" రెండు బాహువులను అందుకొని ముట్టుకొనవలయును.

"ఓం ఊర్వోర్మే ఓజోస్తు" అట్లే రెండు తొడలను అందుకొని ముట్టుకొనవలయును.

"ఓం అరిష్టాని మే అంగాని తనూ స్తన్వా మే సహ సంతు" ఈ మంత్రముతో నీళ్లను శరీరము పైన మార్జనము (చల్లుకొనుట) చేయవలయును.

అథ ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసన.

ఓం విశ్వాని దేవసవిత ర్దురితాని పరాసువ యద్భద్రం తన్న ఆసువ ॥౧॥ యజు. అ-౩౦, మం-౩॥

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ । స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥౨॥ యజు. అ-౧౩, మం-౪॥



య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః । యస్య చ్ఛాయా ఽమృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ ౩॥ యజు. అ-౨౫, మం-౧౩॥

యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ య ఈశే ఽస్య ద్విపద శ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ ౪॥ యజు. అ-౨౩, మం-౩॥

యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాకః । యో అంతరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥ ౫॥ యజు. అ-౩౨, మం-౬॥

ప్రజాపతే న త్వ దేతా న్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ యత్కామాస్తే జుహుమస్తన్నో ఽస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥ ౬॥ ఋ. మం-౧౦, సూ-౧౨౧, మం-౧౦॥

స నో బంధు ర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామ న్నధ్యైరయంత ॥ ౭॥ యజు. అ-౩౨, మం-౧౦॥

అగ్నేనయ సుపథా రాయే అస్మా౯ విశ్వాని దేవ వయునాని విద్వా౯। యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాన్తే నమ ఉక్తిం విధేమ॥ ౮॥ యజు. అ-౪౦, మం-౧౬॥

పై మంత్రములతో భగవస్తోత్రమును అందఱును చేసి ఈశ్వరుని హృదయమందు నిశ్చలచిత్తముతో ధ్యానము చేసి ఆ తరువాత స్వస్తివాచక మాచరింపవలయును, మంత్రములకు అర్థమును తెలిసి యుండవలయును, లేని యెడల నిష్ప్రయోజనము, తెలియకున్నచో పురోహితుడు ముందుగా దెలిపి తరువాత స్తోత్రము ప్రారంభించవలయును.

## అథ స్వస్తివాచకమ్.

అగ్నిమీళే పురోహితంయజ్ఞస్య దేవమృత్విజమ్। హోతారం రత్నధాతమం॥ ౧॥

సనః పితేవ సూనవే ఽగ్నే సూపాయనోభవ। సచస్వానః స్వస్తయే॥ ౨॥ ఋ. మం-౧, సూ-౧, మం-౧-౯॥

స్వస్తి నో మిమీతా మశ్వినాభగః స్వస్తి దేవ్యదితిరనర్వణః। స్వస్తి పూషా అసురో దధాతు నః స్వస్తి ద్యావాపృథివీ సుచేతునా॥ ౩॥



స్వస్తయే వాయు ముప బ్రవామహై సోమం స్వస్తి భువనస్య యస్పతిః। బృహస్పతిం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసో భవన్తునః॥ ౪॥

విశ్వేదేవానో అద్యా స్వస్తయే వైశ్వానరో వసురగ్నిః స్వస్తయే। దేవాఅవన్త్వృభవః స్వస్తయే స్వస్తినో రుద్రః పాత్వంహసః॥ ౫॥

స్వస్తి మిత్రావరుణా స్వస్తి పథ్యే రేవతి। స్వస్తినె ఇంద్ర శ్చాగ్నిశ్చ స్వస్తినో అదితే కృధి॥ ౬॥

స్వస్తి పంథా మనుచరేమ సూర్యచంద్ర మసా వివ పునర్దద తాఘ్నతా జానతా సంగమే మహి॥ ౭॥ ఋ. మం-౫, సూ-౫౧॥

యే దేవానో యజ్ఞియాయజ్ఞియానాం మనోర్యజత్రా అమృతా ఋతజ్ఞాః। తే నో రాసంతా మురుగా యమద్య యూయంపాత స్వస్తిభిః సదానః॥ ౮॥ ఋ. మం-౭, సూ-౩౫॥

యేభ్యో మాతా మధు మత్పిన్వతే పయః। పీయూషం ద్యౌ రదితి రద్రి బర్హాః। ఉక్థ శుష్మా౯ వృషభరా త్స్వప్నసస్తాం ఆదిత్యాం అనుమదా స్వస్తయే॥ ౯॥

నృచక్షసో అనిమిషన్తో అర్హణా బృహద్దేవాసో అమృతత్వ మానశుః । జ్యోతీ రథా అహిమాయా అ నాగసో దివో వర్ష్మాణం వసతే స్వస్తయే॥౧౦॥

సమ్రాజో యే సువృధో యజ్ఞమాయయు రపరిహ్వృ తా దధిరే దివిక్షయమ్। తాం ఆ వివాసనమసా సువృక్తి భిర్మహో ఆదిత్యాం అదితిం స్వస్తయే॥ ౧౧॥

కోవః స్తోమం రాధతి యం జుజోషథ విశ్వేదేవాసో మనుషో యతిష్ఠన । కోవో ఉధ్వరంతు విజాతా అరం కరద్యో నః పర్షదత్యం హః స్వస్తయే॥ ౧౨॥

యేభ్యో హోత్రాం ప్రథమామాయేజే మనుః సమిద్ధాగ్ని ర్మనసా సప్తహోతృభిః । త ఆదిత్యా అభయం శర్మ యచ్ఛత సుగానః కర్త సుపథా స్వస్త యే॥ ౧౩॥

య ఈశిరే భువనస్య ప్రచేతసో విశ్వస్య స్థాతు ర్జగ తశ్చ మన్తవః । తే నః కృతాత కృతాదేన సంపర్యద్యా దేవా సః పిపృతా స్వస్తయే॥ ౧౪॥

భరే ష్విం్ద్రం సుహవే హవామహే ఉహోముచం సుకృతం దైవ్యంజనం । అగ్నిం మిత్రం వరుణాం సాతయే భగంద్యావా పృథివీ మరుతః స్వస్తయే॥ ౧౫॥



సుత్రామాణం పృథివీం ద్యామనే హసంసు శర్మాణ మదితిం సుప్రణీతిం । దైవీం నావం స్వరిత్రా మనాగస మస్రవంతీ మారుహే మా స్వస్తయే॥ ౧౬॥

విశ్వే యజత్రా అధివోచతోతయే త్రాయధ్వం నో దురేవాయా అభిహ్రుతః । సత్యయా వో దేవహూత్యా హువేమ శృణ్వతో దేవా అవసే స్వస్తయే॥ ౧౭॥

అపామీవా మపవిశ్వామనాహుతి మపారాతిం దు ర్విదత్రా మఘాయతః । ఆరే దేవా ద్వేషో అస్మ ద్యు యోత నోరుణః శర్మ యచ్ఛతా స్వస్తయే॥ ౧౮॥

అరిష్టః సమర్తో విశ్వ ఏధతే ప్రప్రజాభి ర్జాయతే ధర్మణస్పరి । య మాదిత్యాసో నయథా సునీతిభి రతి విశ్వాని దురితా స్వస్తయే॥ ౧౯॥

యం దేవాసో వఉవథ వాజసాతౌ యం శూరసాతా మరుతో హితే ధనే । ప్రాతా ర్యావాణం రథ మింద్ర సానసి మరిష్యం తమా రుహేమా స్వస్తయే॥ ౨౦॥

స్వస్తినః పథ్యాసు ధన్వసు స్వస్త్యప్సు వృజనే స్వ ర్వతి । స్వస్తినః పుత్ర కృథేషు యోనిషు స్వస్తిరాయే మరుతో దధాతవ॥ ౨౧॥

స్వస్తి రిద్ధ ప్రపథే శ్రేష్ఠా రేక్ణస్వత్యభియా వామ మేతి। సానో అమాసో అరణే నిపాతు స్వావేశా భవతు దేవగోపా॥ ౨౨॥ ఋ. మం. ౧౦, సూ-౬౩॥

ఇషే త్వోర్జే త్వా వాయవస్థ దేవోవః సవితా ప్రార్ప యతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వమఘ్న్యా ఇం ద్రాయభాగం ప్రజావతీ రనమీవా అయక్ష్మా మా వస్తేన ఈశత మాఘశంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీ ర్యజమానస్య పశూన్ పాహి॥ ౨౩॥ యజు. అ. ౧, మం. ౧॥

ఆనో భద్రాః క్రతవో యన్తు విశ్వతో ఽదబ్ధాసో ఽపరీతాస ఉద్భిదః। దేవానో యథా సదమి ద్వృధే అసన్నప్రాయువో రక్షితారో దివే దివే॥ ౨౪॥

దేవానో భద్రా సుమతి ఋజూయతాం దేవానాం రాతింభినో నివర్తతామ్। దేవానాం సఖ్య ముపసేదిమా వయం దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే॥ ౨౫॥

తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వమవసే హూమహే వయమ్ । పూషానో యథా వేదసామస ద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే॥ ౨౬॥



స్వస్తిన యింద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః। స్వస్తి న స్తార్క్ష్యో అరిష్ఠ నేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు॥ ౨౭॥

భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షిభి ర్యజత్రాః। స్థిరై రంగై స్తుష్టువాం సస్తనూభి ర్వ్యశేమహి దేవహితం యదాయుః॥ ౨౮॥ యజు. అ-౨౫, మం. ౧౪-౧౫-౧౮-౧౯-౨౧॥

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే । ని హోతా స త్సిబర్హిషి॥ ౨౯॥

త్వమగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాం హితః । దేవేభి ర్మానుషే జనే॥ ౩౦॥ సా. ఛంద ఆ. ప్ర. ౧, మం. ౧-౨॥

యే త్రిషప్తాః పరియంతి విశ్వా రూపాణి బిభ్రతః। వాచస్పతి ర్బలా తేషాం తన్వో అద్య దధాతు మే॥ ౩౧॥ అథర్వ. కాం. ౧, సూ. ౧, వర్గ. ౧, అను. ౧, ప్ర. ౧, మం. ౧॥

## అథ శాంతిప్రకరణమ్,

శన్న ఇంద్రాగ్నీ భవతామవోభిః శన్న యింద్రావరుణా రాతహవ్యా। శమింద్రా సోమా సువితాయ శంయోః శన్న ఇంద్రా పూషణా వాజసాతౌ॥ ౧॥

శన్నో భగః శమునః శంసో అస్తు శన్నః పురంధిః శముసంతు రాయః। శనః సత్యస్య సుయమస్య శంసః శన్నో అర్యమా పురుజాతో అస్తు॥ ౨॥

శన్నో ధాతా శము ధర్తా నో అస్తు శన్న ఉరూచీ వతు స్వధాభిః। శంరోదసీ బృహతీ శంనో అద్రిః శంనో దేవానాం సుహవాని సంతు॥ ౩॥

శన్నో అగ్నిర్జ్యోతిరనీకో అస్తు శన్నో మిత్రా వరుణా వశ్వినా శమ్। శన్నః సుకృతాం సుకృతాని సంతు శన్న ఇషిరో అభివాతు వాతః॥ ౪॥

శన్నో ద్యావాపృథివీ పూర్వహూతౌ శమంతరిక్షం దృశయే నో అస్తు। శంనఓషధీ ర్వనినో భవంతు శన్నో రజ సస్పతి రస్తు విష్ణుః॥ ౫॥

శన్న యింద్రో వసుభి ర్దేవో అస్తు శమాదిత్యేభి ర్వరుణః సుశంసః। శంనో రుద్రో రుద్రేభి ర్జలాషః శంన స్త్వష్టాగ్నాభి రిహ శృణోతు॥ ౬॥



శం నః సోమో భవతు బ్రహ్మ శం వస్తు వేదిః॥ ౭॥

శం నః సూర్య ఉరుచక్షా ఉదేతు శం నశ్చతస్రః ప్రదిశో భవంతు। శం నః పర్వతా ధ్రువయో భవంతు శం నః సింధవః శముసంత్వాపః॥ ౮॥

శంనో అదితి ర్భవతు వ్రతేభిః శంనో భవంతు మరుతః స్వర్కాః। శంనో విష్ణుశము పూషానో అస్తు శంనో భవిత్రం శం వస్తు వాయుః॥ ౯॥

శంనో దేవ సవితా త్రాయమాణః శంనో భవం తూషసో విభాతీః। శం నః పర్జన్యో భవతు ప్రజాభ్యః శం నః క్షేత్రస్య పతిరస్తు శంభుః॥ ౧౦॥

శన్నో దేవా విశ్వదేవా భవంతు శం సరస్వతీ సహ ధీభిరస్తు శమభిషాచః శమురాతిషాచః శంనోదివ్యాః పార్థివాః శన్నో అప్యాః॥ ౧౧॥

శం నః సత్యస్య పతయో భవంతు శం నో అర్వంతః శముసంతుగావః। శం నరుభవః సుకృతః సుహస్తా శంనో భవంతు పితరో హవేషు॥ ౧౨॥

శంనోఅజ ఏకపాద్దేవో అస్తు శంనో ఽహిర్బుధ్న్యః శం సముద్రః। శంనో అపాంనపాత్పేరు రస్తు శం నః

పృశ్ని ర్భవతు దేవగోపాపాః॥ ౧౩॥ ఋ. మం. ౭, సూ. ౩౫, మం. ౧-౧౩॥

ఇంద్రోవిశ్వస్య రాజతి శన్నో ఉఅస్తు హిపదేశం చతుష్పదే॥ ౧౪॥

శన్నోవాతః పవతాం శంనస్తపతు సూర్యః। శం నః కనిక్రదద్దేవః పర్జన్యో ఉఅభివర్షతు॥ ౧౫॥

అహాని శం భవంతునః శం రాత్రీః ప్రతిధీయతాం। శం నయింద్రాగ్నీ భవాతమవోభిః శం నఇంద్రావరుణీ రాతహవ్యా। శం న ఇంద్రాపూషణీ వాజసాతౌ శమింద్రా సోమా సువితాయ శంయోః॥ ౧౬॥

శన్నోదేవీ రభిష్టయఉ ఆపోభవంతు పీతయే। శంయోరభిస్రవంతునః॥ ౧౭॥

ద్యౌః శాంతిరంతరిక్షం శాంతిః పృథివీ శాంతిరాపః శాంతిరోషధయః శాంతిః। వనస్పతయః శాంతి విశ్వే దేవాః శాంతిర్బ్రహ్మ శాంతిః సర్వం శాంతిః శాంతివేవ శాంతిః సామాసాంతిరేధి॥ ౧౮॥

తచ్చక్షుర్దేవహితం పురస్తాఛ్ఛుక్రముచ్చరత్। పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం శృణుయామ శరదః శతం ప్రబ్రవామ శరదః శతమదీనాః స్యామశరదః శతం



భూయశ్చశరదః శతాత్॥ ౧౯॥ యజు. అ. ౩౬, మం.౯॥ (౧౦-౧౧-౧౨-౧౭-౨౪).

యజ్జాగ్రతోదూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు॥ ౧॥

యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదథేషుధీరాః యదపూర్వం యక్షమంతః ప్రజానాం తన్మే మనః శివ సంకల్పమస్తు॥ ౨॥

యత్ప్రజ్ఞానముత చేతోధృతిశ్చ యజ్జ్యోతిరంతరమృతం ప్రజాసు। యస్మాన్నఋతే కించనకర్మ క్రియతే తన్మేమనః శివ సంకల్పమస్తు॥ ౩॥

యేనేదం. భూతం భువనం భవిష్యత్పరి గృహీతమమృతేన సర్వమ్। యేన యజ్ఞస్తాయతే సప్తహోతా తన్మేమనః శివ శంకల్పమస్తు॥ ౪॥

యస్మిన్నృచః సామయజూంషి యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః। యస్మిం శ్చిత్తంసర్వమోతం ప్రజానాం తన్మేమనః శివ సంకల్పమస్తు॥ ౫॥

సుషారథి రశ్వానివ యన్మనుష్యాన్నేనీయతే ఒభీశుభిర్వాజినఇవ। హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మేమనః శివసంకల్ప మస్తు॥ ౬॥ యజు.అ. ౩౪,మం.౧॥

సనః పవస్వ శంగవే శంజనాయ శమర్వతే। శం రాజన్నోషధీభ్యః॥ ౨౦॥ సామ॥ ఉ. ౧, మం. ౩॥

అభయంనః కరత్యంతరిక్షమభయం ద్యావాపృథివీ ఉభేఇమే। అభయం పశ్చాదభయం పురస్తా దుత్తరాద ధరాదభయంనో అస్తు॥ ౩౪॥

అభయం మిత్రాదభయ మమిత్రాదభయం జ్ఞాతాద భయం పరోక్షాత్। అభయం నక్తమభయం దివానః సర్వాఆశా మమమిత్రంభవంతు॥ ౧॥ అధర్వ. కాం. ౧౯, సూ. ౧౫-౬॥

ఇతి శాంతి ప్రకరణం.

అథ అగ్న్యాధాన విధి.

“ఓం భూర్భువస్స్వః” ఈ మంత్రోచ్చారణ చేసి అగ్నిని వెలిగించవలెను॥

“ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నాపృథివీవ వరిమ్ణా। తస్యాస్తే పృథివి దేవయజని పృష్ఠే ఽగ్ని



మన్నాద మన్నాద్యాయాదధే”॥ ౧॥ యజు.అ.౩,మం.౫॥

ఈ మంత్రముతో అగ్నిలో చిన్నచిన్న సమిధలు వేసి అగ్ని ప్రదీప్తి కొరకై కర్పూరాదులు వేయవలెను. నోటితో వూదక వ్యంజనముతో విసరవలయును.

“ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి త్వమిష్టాపూర్తే సంసృజేథా మయంచ। అస్మిన్త్సధస్థే ఽఅధ్యుత్తరస్మిన్ విశ్వేదేవాయజమానశ్చ సీదత॥” యజు.అ ౧౫,మం.౫॥

ఈ మంత్రములతో అగ్నిని ప్రజ్వలింప జేయవలెను. తరువాత ఈ క్రింది మంత్రములు చెప్పుచు కాష్ఠముల నొక్కొక్కటిని నేతిలో అద్ది కుండమందుంచవలయును.

“ఓం అయంత ఇధ్మ ఆత్మా జాతవేదస్తేనే ధ్యస్వ వర్ధస్వచేద్ధ వర్ధయ చాస్మాన్ ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసేనాన్నాద్యేన సమేధయ స్వాహా॥ ఇదమగ్నయే జాతవేదసే ఇదన్నమమ॥ ౧॥ ఓంసమిధాగ్నిం దువస్యత ఘృతైర్బోధయతాతిథిం। అస్మిన్ హవ్యాజుహోతన స్వాహా॥ ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౨॥ సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రంజుహోతన అగ్నయే జాతవేదసే స్వాహా॥ ఇదమగ్నయే జాతవేదసే ఇదన్నమమ॥ ౩॥ తన్త్వా సమిద్భిరంగిరో ఘృతేన వర్ధయామసి బృహ

చ్ఛాయవిష్ఠయ స్వాహా॥ ఇదమగ్నయే ఽంగిరసే ఇదన్నమమ॥ ౪॥ యజు. అ. 3, మం. ౧-౨-3॥

ఈ క్రింది మంత్రములతో ఆహుతులు అయిదు ఈయవలయును.

"ఓం అయంత ఇధ్మ ఽ ఆత్మాజాతవే దస్తే నేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్ ప్రజయా పశుభి ర్బ్రంహ్మ వర్చసే నాన్నాద్యేన సమేధయ స్వాహా" ఇద మగ్నయే జాతవేదసే ఇదన్నమమ॥ ౧॥

అనంతరము దోసిలితో నీళ్లు పుచ్చుకొని తూర్పు మొదలగు దిక్కులకు ఈక్రింద మంత్రములతో చిలకరించవలయును.

"ఓం అదితే ఽ అనుమన్యస్వ" తూర్పు దిక్కునకు,

"ఓం అనుమతే ఽ అనుమన్యస్వ" దక్షిణ దిక్కునకు, పశ్చిమ దిక్కునకు.

"ఓం సరస్వత్యనుమన్యస్వ" ఉత్తర దిక్కునకు.

"ఓం దేవసవితః ప్రసువ యజ్ఞంప్రసువ యజ్ఞపతిం భగాయ। దివ్యో గంధర్వః కేతపూః కేతంనః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు॥" యజు. అ. 3౦, మం. ౧॥



ఈమంత్రముతో నలు దిక్కులు చిలకరించి తరువాత సామాన్య హోమాహుతులు చేయవలెను.

హోమాహుతులలో ఆది యంతములందు యజ్ఞ కుండమునకు ఉత్తర దక్షిణ దిక్కులందు యిచ్చెడు ఆహుతులకు ఆఘారావాజ్యాహుతి) యని పేరు. కుండ మధ్యమం దిచ్చెడు ఆహుతులకు (ఆజ్యభాగాహుతి) యని పేరు.

తరువాత ఘృత పాత్రమునుండి స్రువము. (మిళ్ళిగరి చె)తో నిండుగా (బొటనవ్రేలు మధ్యమ అనామిక ములతో పట్టుకొని నేతిని తీసుకొని క్రింది మంత్రముతో ఆహుతియ్యవలెను.

"ఓం అగ్నయేస్వాహా ఇదమగ్నయే యిదన్నమమ" ఉత్తరము.

ఓం సోమాయస్వాహా "ఇదంసోమాయ ఇదన్నమమ" దక్షిణము.

ఓం ప్రజాపతయేస్వాహా "ఇదం ప్రజాపతయే ఇదన్నమమ" మధ్య.

ఓం ఇంద్రాయస్వాహా "ఇదమింద్రాయా ఇదన్నమమ" మధ్య.

తదనంతరము నాలుగు ఆహుతులు ఆఘారా వాజ్య భాగా హుతులు యిచ్చి పిమ్మట పూర్ణాహుతి 4 ఆఘారా వాజ్యభాగా హుతులు యిచ్చి తదనంతరము ప్రజ్వలిత సమిధలపై వ్యాహృతియొక్క నాలుగాహుతులు యియ్యవలయును.

1. ఓం భూరగ్నయే స్వాహా "ఇదమగ్నయే ఇదన్నమమ॥"
2. ఓం భువర్వాయవేస్వాహా "ఇదంవాయవే ఇదన్న మమ"
3. ఓం స్వరాదిత్యాయ స్వాహా "ఇదమాదిత్యాయ ఇదన్నమమ॥"
4. ఓం భూర్భువః స్వరాగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా "ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః" ఇదన్నమమ॥

ఈ నాలుగు ఆజ్యాహుతు లిచ్చి దిగువ మంత్రములతో స్విష్ట కృత హోమాహుతి చేయవలెను. స్విష్ట కృత హోమము నేతితోనైనను, అన్నాదులతోనైనను చేయవలయును.

ఓం యదస్య కర్మణోఽత్యరీరిచం యద్వాన్యూనమిహాకరమ్ । అగ్నిష్టత్స్విష్టకృద్విద్యాత్సర్వం స్విష్టం సుహుతంకరోతు మే। అగ్నయేస్విష్టకృతే సుహుతహుతే



సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్ధయిత్రే సర్వాన్నః కామాన్త్సమర్ధయ స్వాహా "ఇదమగ్నయే స్విష్టకృతే ఇదన్నమమ॥

ఈ తరువాత ప్రాజాపత్యాహుతి ఈక్రింది మంత్రము హృదయములో ధ్యానించుచు యియ్యవలయును.

ఓం ప్రజాపతయే స్వాహా॥ ఇదం ప్రజాపతయే ఇదన్న మమ.

పై మంత్రముతో మానసముతో ఒక ఆహుతియు, తరువాత, నాలుగు ఆజ్యాహుతులు యియ్యవలయును.

ఓం భూర్భువస్వః । అగ్న ఆయూంషి పవస్వ ఆసువోర్జమిషంచనః ఆరే బాధస్వదుచ్ఛునాం స్వాహా॥ ఇదమగ్నయే పవమానాయ - ఇదన్నమమ॥ ౧॥

ఓం భూర్భువస్వః । అగ్నిఋషిః పవమానః పాంచజన్యః పురోహితః తమీమహే మహాగయం స్వాహా॥ ఇదమగ్నయే పవమానాయ ఇదన్నమమ॥ ౨॥

ఓం భూర్భువఃస్వః అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చః సువీర్యం । దధద్రయిం మయిపోషం స్వాహా॥ "ఇదమగ్నయే పవమానాయ ఇదన్నమమ॥ 3॥ ఋ. మం. ౯, సూ. మ. ౧౯॥ ౨౦॥ ౨౧॥

ఓం భూర్భువఃస్వః ప్రజాపతే నత్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితాబభూవ యత్కామాస్తే జుహుమ స్తన్నో అస్తు వయంస్యామ పతయోరయీణాం స్వాహా॥ ఇదం ప్రజాపతయే-ఇదన్నమమ॥ ౪॥ ఋ. మం. ౧౦॥ సూ. ౧-౨౧, మం. ౧౦॥

దీనితో నాలుగు ఆహుతు లిచ్చి, ఈక్రింది మంత్రము లతో అష్టాజ్యాహుతి యియ్యవలయును.

ఓం త్వన్నోఽ అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోఽ అవయాసిసీష్ఠాః। యజిష్ఠోవహ్నితమః శోశుచానో విశ్వాద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా॥ ఇదమగ్ని వరుణాభ్యామ్ ఇదన్నమమ॥ ౧॥

ఓం సత్వన్నోఽ అగ్నే వమోభవోతీ నే దిష్ఠోఽ అస్యా ఉషసో వ్యుష్టౌ అవ యక్ష్వనో వరుణం రరాణో వీహి మృడీకంసుహవోన ఏధిస్వాహా॥ ఇదమగ్నీ వరుణాభ్యాం॥ ఇదన్నమమ॥ ౨॥ ఋ. మం. ౪, సూ. ౧, మం. ౪-౫॥

ఓం ఇమంమే వరుణ శృధీహ వమద్యాచ మృడయ। త్వామవస్యురాచకే స్వాహా॥ ఇదంవరుణాయ। ఇదన్న మమ॥ ౩॥ ఋ-మ౧ సూ౨౫ మం౧౯॥



ఓం తత్వాయామి బ్రహ్మణో వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశంస మాన ఆయుః ప్రమోషీఃస్వాహా॥ ఇదం వరుణాయ। ఇదన్నమమ॥ ౪॥ ఋ.మం.౧, సూ.౨౪, మం ౧౧॥

ఓం యే తేశతం వరుణయే సహస్రం యజ్ఞియాః పాశావితతామహాన్తః। తేభిర్నో అద్యస వితోత విష్ణుర్విశ్వేముఞ్చన్తుమరుతః స్వర్కాః స్వాహా॥ ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యోదేవేభ్యో మరుద్భ్యః స్వర్కేభ్యః। ఇదన్నమమ॥ ౫॥

ఓం అయాశ్చాగ్నేఽ స్యనభిశస్తి పాశ్చ సత్యమిత్వమయాసి। అయానోయజ్ఞం వహాస్యయానోధేహి భేషజం స్వాహా॥ ఇదమగ్నయే అయసే। ఇదన్నమమ॥ ౬॥

ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మద వాధమం విమధ్యమంశ్రథాయ। అథా వయమాదిత్య వ్రతే తవానాగసోఽదితయే స్యామస్వాహా। ఇదం వరుణాయాఽ ఽదిత్యాయాఽ దితయేచ। ఇదన్నమమ॥ ఋ.మం.౧, సూ.౨౪, మం. ౧౫॥

ఓం భవతన్నః సమనసౌ సచేతసావరేపసౌ। మాయజ్ఞం హింసిష్టం మాయజ్ఞపతిం జాతవేదసౌ

శిశా భవపమద్యనః స్వాహా! ఇదం జాతవేదో'ఖ్యాం ఇదన్నమమ! యజు. అ. గ, మం. 3॥

తరువాత వరుడు తన యింటికి వెళ్ళి ఉత్తమనస్త్రాలంకారుడై యజ్ఞశాలకు వచ్చి పూర్వాభిముఖుడై కూర్చుండి యిదివరలో వివరించిన ప్రకారము ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసనచేసి, వధువు యింటికి వెళ్ళవలయును. వరుని వెంటనే వధూవర పక్షమువారుభయులును, వధువుయిల్లు ప్రవేశించిన వెంటనే వధువును కార్యకర్తలును మధు సర్కానులవలన వరుని ఈక్రింది విధముగా సన్మాన సత్కారములు నడుప వలయును.

వరుడు పూర్వాభిముఖముగా నిలుచుండ వలయును. వధువును కార్యకర్త సమీపమున ఉత్తరాభిముఖులై నిలువ వలయును.

వధువును, కార్యకర్తయును: — "సాధుభవానాస్తామర్చయిష్యామో భవంతమ్" ఈ మంత్రము చెప్ప వలయును.

దీని పైన "ఓం అచర్య" అని ప్రత్యుత్తర మిచ్చి పునః వధువు వరుని కొరకు పీఠము సిద్ధపరచి యుండిన స్థలమునకు పోయి ఆసనము లేక పీఠమును తీసుకొని



వరుని ముందరవచ్చి నిలువ వలయును. అట్లు నిలువబడి వధువు:—

ఓం విష్టరో విష్టరో విష్టరః ప్రతిగృహ్యాతామ్ = ఈ యుత్తమాసనమును తాము గ్రహించుడు.

వరుడు:—ఓం ప్రతిగృహ్ణామి॥ అనిచెప్ప వధువుచేతిలోని ఆసనమును తీసుకొని దానిపై పూర్వాభిముఖముగా కూర్చుండి వరుడు:—

ఓం వర్ష్మోఽస్మి సమానానా ముద్యతామివసూర్యః। ఇమన్తమభితిష్ఠామి యో మా కశ్చాభి ధాసతి॥ ఈ మంత్రమును చెప్పిన తరువాత కార్యకర్త పంచ పాత్రతో నీళ్లను వధువుచేతి కియ్యవలెను. వధువు నీళ్ళుగల పాత్రను తీసుకొని "ఓం అర్ఘోఽర్ఘోఽర్ఘః ప్రతిగృహ్యాతామ్" అను మంత్రము చెప్పి వరుని చేతి కివ్వ వలయును.

వరుడు:—"ఓం ప్రతి గృహ్ణామి" అని చెప్పి జల పాత్రను పుచ్చుకొని ముఖ ప్రక్షాళనము చేసుకొని "ఓం ఆపస్థ యుష్మాభిః సర్వాన్ కామానవాప్నవాని। ఓం సముద్రం వః ప్రహిణోమి స్వాం యోనిమభిగచ్ఛత। అరిష్టాస్మాకం వీరా మా పరాసేచిమత్పయః॥

ఈ మంత్రము చెప్పి సిద్ధపరచిన ఆసనము మీాద కూర్చుండ వలయును. తరువాత కార్యకర్త వధువుచేతి మరియొక జలపాత్రము నిచ్చి ఆచమనము కొరకివ్వుమని చెప్పవలెను.

కన్యః:—ఓం ఆచమనీయ మాచమనీయం ప్రతిగృహ్యతామ్॥ ఈ మంత్రము చెప్పి వరుని ముందర ఆ జల పాత్ర ముంచవలయును.

వరుడు:—ఓం ప్రతిగృహ్ణామి॥ అని చెప్పి జల పాత్రమును పుచ్చుకొని అరచేతిలో పట్టు తగినన్ని నీళ్లను పోసికొని "ఓం అమాగన్ యశసాసం సృజి వర్చసా తం మాకురుప్రియం ప్రజానామధిపతిం పశూనామ రిష్టం తనూనామ్॥ అను మంత్రముచేత యొకసారియు, యిదే మంత్రము చెప్పి, మరి రెండు సార్లు అనగా మూడు మార్లు, ఆచమనము చేయవలెను.

తరువాత కార్యకర్త వధువుచేతికి మధుపర్కము అనగా (12 తులములు) పెరుగులో (4 తులములు) తేనెనుగాని లేక నేతినిగాని వేసిన పాత్రమును యియ్యవలెను. అప్పుడు కన్యః —



ఓం మధుపర్కో మధుపర్కో మధుపర్కః ప్రతిగృహ్యతామ్॥ అని చెప్పి యియ్యవలెను.

వరుడు దానిని "ఓం ప్రతిగృహ్ణామి" అని పుచ్చుకొని చేతిలో నుంచుకొని "ఓం మిత్రస్యత్వా చక్షుషా ప్రతీక్షే" అను మంత్రమును చెప్పుచు దానిని దృష్టించి చూచి, మరియు,

ఓం దేవస్యత్వా సవితుః ప్రసవే ఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి॥ అని చెప్పి ఆ పాత్రను వామ హస్తముతో తీసికొని మరియు,

ఓం భూ ర్భువః స్వః మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నః సంత్వోషధీః॥ భూర్భువః స్వః మధునక్తముతోషసో మధుమత్పార్థివం రజః మధుద్యౌరస్తు నః పితా॥ ౨॥

ఓం భూర్భువః స్వః మధుమాన్నో వనస్పతి ర్మధుమాం అస్తుసూర్యః మాధ్వీర్గావో భవంతునః॥

ఈ మూడు మంత్రములతో మధుపర్కమును చూడవలయును.

పిమ్మట "ఓం నమః శ్యావాస్యాయాన్న శనే యత్త ఆవిద్ధం తత్తే నిష్కృంతామి" ఈ మంత్రము చెప్పి కుడి

చేతి, అనామికా అంగుష్ఠములతో మధుపర్కమును
మర్దించవలెను. అనగా ఆ రెండంగుళములతోనే పిసికి
నట్లు చేయవలెను. కలుపవలెనని తాత్పర్యము. అటు
తరువాత ఆ మధుపర్కములో కొంచెము తీసుకొని,

ఓం వసవస్త్వా గాయత్రేణ ఛందసా భక్షయంతు॥
ఈ మంత్రముతో తూర్పు దిక్కునకున్ను,
ఓం రుద్రాస్త్వాత్రైష్టుభేన ఛందసాభక్షయంతు॥
ఈ మంత్రముతో దక్షిణ దిక్కునకున్ను,
ఓం ఆదిత్యాస్త్వా జాగతేన ఛందసా భక్షయంతు॥
ఈ మంత్రముతో పశ్చిమ దిక్కునకున్ను,
ఓం విశ్వేత్వాదేవా అనుష్టుభేన ఛందసాభక్షయంతు॥
ఈ మంత్రముతో ఉత్తరపు దిశకున్ను కొంచెము

కొంచెము క్రింద వేయవలయును.

ఓం భూతేభ్యస్త్వా పరిగృహ్ణామి॥ ఈ వాక్యము చెప్పి
మధ్య భాగమందలి మధుపర్కమును పైకి మూడుమార్లు
చల్లి, ఆ తరువాత దానిని మూడు భాగములు చేసి
మూడు కంచు పాత్రలలోనునిచి, తనముందు ఆమూటిని
ఉంచుకొని, అనంతరము,



ఓం యనమధునో మధవ్యం పరమం రూపమన్నాద్యం
తేనాహం మధునో మధవ్యేన పరమేణ రూపేణాన్నాద్యే
న పరమో మధవ్యో ఽన్నాదో ఽసాని॥ ఈ మంత్ర
మొకతూరి చెప్పి ఒక పాత్రములో కొంచెము కొంచెము
చొప్పున ప్రాశనము చేయవలయును అనగా భుజించ
వలయును. మిగిలిన దానిని సీటిలో కలిపి వేయవలెను,
లేక సేవకులకు యియ్యవచ్చును. ఆ తరువాత,

ఓం అమృతా పిధానమసి స్వాహా,
ఓం సత్యం యశః శ్రీర్మయిశ్రీః శ్రయతాం స్వాహా,

ఈ పై రెండు మంత్రములతోను రెండు ఆచమన
ములు వరుసు చేసి తత్పశ్చాత్ వరుసు ఈక్రింది మంత్ర
ములతో అంగ స్పర్శచేయవలెను.

ఓం వాఙ్మ ఽ ఆస్యేఽస్తు
ఈ మంత్రముతో ముఖస్పర్శ
ఓం నసోర్మే ప్రాణోస్తు ,, నాసికారంధ్రములు
ఓం అక్ష్ణోర్మే చక్షురస్తు ,, నేత్రములు
ఓం కర్ణయోర్మే శ్రోత్రమస్తు ,, చెవులు
ఓం బాహ్వోర్మే బలమస్తు ,, బాహువులు
ఓం ఊర్వోర్మే ఓజోస్తు ,, జంఘులు

ఓం అరిష్టానిమే అంగానిత నూ _స్తనావ్వమే సహాసంతు మార్జనము చేయవలయును, ఆపిమ్మట కన్య:—

ఓం గో గా గ్గాః ప్రతిగృహ్యాతాను ఈ మంత్రముచేత వరునకు గోదానాది దానములు, శక్త్యానుసార మియ్య వలయును.

ఓం ప్రతిగృహ్ణామి॥ ఈ మంత్రముచేత వరుడు కన్య యిచ్చిన దానాదులు గ్రహించ వలయును.

మధుపర్కము ముగిసిన తరువాత వేరే గృహామునకు గాని లేక సభామంటపము రచించి యుండిన యెడల, సభామంటపమునకు పిలుచుకొనిపోయి, శుభాసనమందు పూర్వాభిముఖముగా కూర్చుండపెట్టి వరునకెదురుగా పశ్చిమ ముఖముగా వధువును కూర్చుండబెట్టి కార్యకర్త ఉత్తరాభిముఖముగా కూర్చుండి,

ఓం అముఖ... గోత్రోత్పన్నామి మూమముక + నా మ్నీమలంకృతాం కన్యాం ప్రగృహ్ణాతుభవాన్, ఇట్లు చెప్పి వరుని చేతిలో వధువు చేతినుంచి,

ఓం ప్రతిగృహ్ణామి అనిచెప్పి,



ఓం యా అకృతన్నవయం యా అతన్వతయాశ్చ దేవీ స్తస్తాం నభితో తతస్థ తాస్త్వాదేవీర్జరసే సంఖ్యాయస్వా యుష్మతీదం పరిధ_త్స్వవాసః.

ఈ మంత్రముతో కన్యకు వరుడు పవస్త్రమును యియ్యవలెను. దానిని యజ్ఞోపవీతమువలె కన్య ధరించ వలయును.

ఓం జరాగచ్ఛ పరిధ_త్స్వవా సోభవాకృష్టీ నామభి శ_స్త పావా। శతంచ జీవ శరదః సువచార్చారయించ పుత్రానను సంఖ్యాయయ స్వాయుష్మతీదం పరిధ_త్స్వ వాసః॥

ఈ మంత్రము చెప్పి వధువునకు వస్త్రాదు లియ్య వలయును.

ఓం పరిదాస్యై యశోధాస్యై దీర్ఘాయుత్వాయ జరదష్టి రస్మి। శతంచ జీవామి శరదః ప్రరూచీ రాయ స్పోష మభిసంఖ్యాయిష్యే॥

ఈ పైమంత్రము చెప్పి వరుడు అధోవస్త్రము ధరించ వలెను.

ఓం యశసా మా ద్యావా పృథివీ యశసేంద్రో బృహస్పతీ। యశోభగశ్చ మా విద ద్యశో మా ప్రతి పద్యతామ్॥

పైమంత్రము చెప్పి తక్కిన వస్త్రములను ధరింప వలయును. పిమ్మట హోమ కుండమునకు దక్షిణ దిక్కునందు ఉత్తరాభి ముఖముగా కలశస్థాపనచేసి వర పక్షమువారొకరు ఆలాగుననే కూర్చుండి బియ్యపు లేక జొన్నల పేలాలును, యెండిన శమీ పత్రములును(ర)నా లుగు దోసిళ్లు చేటలో పోసికొని ఉంచుకొని యజ్ఞకుం డము పశ్చిమమున పూర్వాభి ముఖముగా కూర్చుండి వధూవరులను పిలిచి వారితో "ఓం సమజంతు విశ్వే దేవాః సమాపో హృదయానినౌ। సంమాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతునౌ" ఈమంత్రమును చెప్పించి వధూవరులు తమ కుడి హస్తముల నొకరి కొకరు పట్టుకొనునట్లు చేయవలయును.

ఓక యద్రైషి మనసాదూరం దిశోఽను పవమానో వా। హిరణ్య పర్ణో వైకర్ణః సత్వా మన్మనసాం కరోతు * అసౌ॥ అను మంత్రమును వరుడు చెప్ప



వలెను. అసౌ అను పదమునకు బదులు...కన్యపేరు చెప్ప వలెను. తరువాత వధూవరు లిద్దరున్ను నిల్వవలెను.

ఓం భూర్భువః స్వః అఘోర చక్షు రపతి ఘ్న్యేధి శివా పశుభ్యః సుమనాః సువర్చాః। వీరసూర్దేవృకామా స్యోనా శన్నోభవ ద్విపదే శం చతుష్పదే॥ ఓం భూ ర్భువః స్వః। సానః పూషా శివతమామైరయ సా న ఊరు ఉశతి విహర। యస్యాముశన్తః ప్రహరామ శేఫం యస్యాము కామా బహవో నివిష్ట్యై॥

పై మంత్రములు వరుడు చెప్పి యజ్ఞకుండ ప్రదక్షి ణమును వధూవరు లిద్దరునుచేరి యథా స్థానమున యిద్దరును కూర్చుండవలెను, ఆ తరువాత వధువు:—

ఓం ప్రమే పతియానః పంథాః కల్పతాం శివా అరిష్టా పతిలోకం * మేయమ్॥ అను మంత్రము చెప్ప వలెను. పిమ్మట వధువు:—

ఓం అమృతో ప స్తరణమసి స్వాహా

ఓం అమృతా పిధానమసి స్వాహా

ఓం సత్యం యశః శ్రీమయి శ్రీః శ్రయతాం స్వాహా॥

అను మూడు మంత్రములతో మూడు ఆచమనములు చేయవలెను. యిదే ప్రకారము వరుడును, పురోహితు

మను చేయవలయును. పిమ్మట పురోహితుడు, నకార్య కర్తయును,

ఓం అదితేను మన్యస్వ॥ ఈ మంత్రముతో తూర్పు దిక్కున నీళ్లు చిలకరించ వలయును,

ఓం అనుమతేను మన్యస్వ॥ దీనితో దక్షిణ దిక్కునకు,

ఓం సరస్వత్యనుమన్యస్వ॥ ఉత్తరపు దిక్కునకు,

ఓం సరస్వత్యనుమన్యస్వ॥ దీనితో పశ్చిమ దిక్కునకు,

ఓం దేవసవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ। దివ్యో గంధర్వః కేతపూః కేతంనః పునాతు వాచస్పతిర్వాచంనః స్వదతు॥ ఈ మంత్రముతో అంతటను అనగా కుండమునకు చతుర్దిక్కులకు, నీళ్లు చిలకరించవలెను.

తరువాత వధూవరులును, కార్యకర్త, పురోహితులును, ఆధారావాజ్య భాగాహుతులు ౪ నేతితోను, మరియు అష్టాజ్యాహుతులు, అంతు ౧౨ ఆహుతులు ఇచ్చి, ప్రధాన హోమ సమయమందు వధువు తన కుడి చేతిని వరుని మూపును స్పృశించి అనగా తాకి,

ఓం భూర్భువః స్వః అగ్న ఆయూంషి, ఇత్యాది



మంత్రములతో (౪) నాలుగు ఆజ్యాహుతు లియ్యవలెను. తరువాత,

ఓం భూర్భువః స్వః। త్వమర్యమా భవసి యత్కనీనాం నామ స్వధావన్ గుహ్యం బిభర్షి। అంజంతి మిత్రం సుధితం న గోభిర్యద్దంపతీ సమనసా కృణోషి స్వాహా। ఇదమగ్నయే యిదన్నమమ, ఈ మంత్రముతో ౧౭వ ఆజ్యాహుతి యిచ్చి, తరువాత,

ఈ క్రింద పండ్రెండు మంత్రములతో పండ్రెండు ఆజ్యాహుతు లియ్యవలెను. ఈ మంత్రములు వధూవరులు చేరి పురోహితుడును, కార్యకర్తయును అందరును చెప్పవలయును. వధూవరులు ముఖ్యముగా చెప్పవలయును.

ఓం ఋతాషాడ్ ఋతధామాగ్ని ర్గంధర్వః స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ ఇదమృతాసాహే ఋతధామ్నే అగ్నయే గంధర్వాయ ఇదన్నమమ॥ ౧॥

ఓం ఋతాషాడ్ ఋతధామాగ్ని ర్గంధర్వ స్తస్యౌషధయో ఽప్సరసో ముదో నామ తాభ్యః స్వాహా ఇదమోషధిభ్యో ఽప్సరోభ్యో ముద్భ్యః ఇదన్నమమ॥ ౨॥

ఓం సంహితో విశ్వసామా సూర్యో గంధర్వః సన
ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ ఇదం
సంహితాయ విశ్వ సామ్నే సూర్యాయ గంధర్వాయ
ఇదన్నమమ॥ 3॥

ఓం సంహితో విశ్వ సామాసూర్యో గంధర్వ స్తస్య
మరీచయో ఉప్సరస ఆయువో నామ తాభ్య స్వాహా
ఇదం మరీచిభ్యో ఉప్సరోభ్య ఆయుభ్యః ఇదన్నమమ॥౪॥

ఓం సుషుమ్ణః సూర్యరశ్మి శ్చంద్రమా గంధర్వః సన
ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ ఇదం
సుషుమ్ణాయ సూర్య రశ్మయే చంద్రమసే గంధర్వాయ
ఇదన్నమమ॥ ౫॥

ఓం సుషుమ్ణః సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వ స్తస్య
నక్షత్రాణ్యప్సరసో భేకురయో నామ తాభ్యః స్వాహా
ఇదం నక్షత్రేభ్యో ఉప్సరోభ్యో భేకురుభ్యః ఇదన్న
మమ॥ ౬॥

ఓం ఇషిరో విశ్వ వ్యచా వాతో గంధర్వః సన ఇదం
బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ ఇదమిషిరాయ
విశ్వవ్యచసే వాతాయ గంధర్వాయ ఇదన్నమమ॥ ౭॥



ఓం ఇషిరో విశ్వవ్యచా వాతో గంధర్వ స్తస్యాపో
ఉప్సరస ఊర్జోనామ తాభ్య స్వాహా ఇదమద్భ్య
అప్సరోభ్య ఉఊర్గభ్యః ఇదన్నమమ॥ ౮॥

ఓం భుజ్యుః సుపర్ణో యజ్ఞో గంధర్వః సన ఇదం
బ్రహ్మ క్షత్రం పాతు తస్మైస్వాహా వాట్ ఇదం భుజ్యవే
సుపర్ణాయ యజ్ఞాయ గంధర్వాయ ఇదన్నమమ॥ ౯॥

ఓం భుజ్యుః సుపర్ణో యజ్ఞో గంధర్వ స్తస్య దక్షిణో
అప్సరసః స్తావానామ। తాభ్యః స్వాహా ఇదం దక్షిణో
భ్యో అప్సరోభ్యః స్తావాభ్యః ఇదన్నమమ॥ ౧౦॥

ఓం ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వః। సన ఇదం
బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహావాట్ ఇదం ప్రజా
పతయే విశ్వకర్మణే మనసే గంధర్వాయ ఇదన్న
మమ॥ ౧౧॥

ఓం ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వ స్తస్య ఉ
ఋక్ సామాన్యప్సరస ఏష్టయో నామ। తాభ్య స్వాహా
ఇదం ఋక్ సామేభ్యో ఉప్సరోభ్య ఏష్టిభ్యః ఇదన్న
మమ॥ ౧౨॥

ఈ మంత్రములతో ౧౨ ఆహుతు లిచ్చిన తరువాత,
జయా హోమము చేయవలెను.

ఓం చిత్తంచ స్వాహా ఇదంచిత్తాయ ఇదన్నమమ॥ ౧॥
ఓం చిత్తిశ్చ స్వాహా ఇదంచిత్త్యై। ఇదన్నమమ॥ ౨॥
ఓం ఆకూతంచ స్వాహా ఇదమాకూతాయ ఇదంనమమ॥ ౩॥
ఓం ఆకూతిశ్చ స్వాహా ఇదమాకూత్యై ఇదన్నమమ॥ ౪॥
ఓం విజ్ఞాతంచ స్వాహా ఇదంవిజ్ఞాతాయ ఇదన్నమమ॥ ౫॥
ఓం విజ్ఞాతిశ్చ స్వాహా ఇదంవిజ్ఞాత్యై ఇదన్నమమ॥ ౬॥
ఓం మనశ్చ స్వాహా ఇదంమనసే ఇదన్నమమ॥ ౭॥
ఓం శక్వరీ స్వాహా ఇదంశక్వరీభ్యః ఇదన్నమమ॥ ౮॥
ఓం దర్శశ్చ స్వాహా ఇదందర్శాయ ఇదన్నమమ॥ ౯॥
ఓం పౌర్ణమాసంచ స్వాహా ఇదంపౌర్ణమాసాయ
ఇదన్నమమ॥ ౧౦॥
ఓం బృహచ్చ స్వాహా ఇదంబృహతే ఇదన్నమమ॥ ౧౧॥
ఓం రథంతరంచ స్వాహా ఇదంరథంతరాయ ఇదన్నమమ॥
౧౨॥

ఓం ప్రజాపతిర్జయా నింద్రాయ వృష్ణేప్రాయచ్ఛ దుగ్రః ప్రతనాజయేషు తస్మైవిశః సమనమంతసర్వాః స ఉగ్రః స ఇహావ్యోబభూవ స్వాహా ఇదం ప్రజాపతయే జయానింద్రాయ ఇదన్నమమ॥ ౧౩॥



ఈ జయా హోమములో॥ ౧౩॥ ఆహుతులిచ్చి తరువాత, అభ్యాతవ హోమము చేయవలెను.

ఓం అగ్నిర్భూతా నామధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవ హూత్యాం స్వాహా॥ ఇదమగ్నయే భూతానామధిపతయే ఇదన్నమమ॥ ౧॥

ఓం ఇంద్రో జ్యేష్ఠానామధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాందేవ హూత్యాం స్వాహా ఇదమింద్రాయ జ్యేష్ఠానామధిపతయే ఇదన్నమమ॥ ౨॥

ఓం యమః పృథివ్యా అధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం యమాయ పృథివ్యా అధిపతయే। ఇదన్నమమ॥ ౩॥

ఓం వాయురంత రిక్షస్యాధి పతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామా శిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదంవాయవే అంత రిక్షస్యాధి పతయేఇదన్నమమ॥ ౪॥

ఓం సూర్యో దివోఽధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మ
ణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం
సూర్యాయ దివోఽధి పతయే। ఇదన్నమమ॥ ౫॥

ఓం చంద్రమా నక్షత్రాణామధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామా శిష్యస్యాం పురోధా
యామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా।ఇదం
చంద్రమసే నక్షత్రాణా మధిపతయే। ఇదన్నమమ॥ ౬॥

ఓం బృహస్పతి ర్బ్రహ్మణోఽధిపతిః సమావత్వ
స్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేస్యామాశిష్యస్యాం పురో
ధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా।
ఇదంబృహస్పతయే బ్రహ్మణోధి పతయే ఇదన్నమమ॥ ౭॥

ఓం మిత్రః సత్యానామాధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామాశిష్యస్యాం పురోధా
యామస్మిన్ కర్మణ్యసాం దేవహూత్యాం స్వాహా। ఇదం
మిత్రాయ సత్యానామాధి పతయే। ఇదన్నమమ॥ ౮॥

ఓం వరుణోఽపా మధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మ



ణ్యస్మిన్ క్షత్రేఽస్యా మా శిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం
వరుణోయాపామ ధిపతయే। ఇదన్నమమ॥ ౯॥

ఓం సముద్రః స్రోత్యానామధి పతిః సమావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం పురోధా
యామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా।ఇదం
సముద్రాయ స్రోత్రానామధిపతయే ఇదన్నమమ॥ ౧౦॥

ఓం అన్నం సామ్రాజ్యా నామధి పతిః సమావ
త్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం
పురోధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం
స్వాహా। ఇదమన్నాయ సామ్రాజ్యానామధి పతయే
ఇదన్నమమ॥ ౧౧॥

ఓం సోమఽ ఓషధీనామధిపతిః సమావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ఽస్యామా శిష్యస్యాం పురోధా
యామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం
సోమాయ ఓషధీనామధిపతయేః ఇదన్నమమ॥ ౧౨॥

ఓం సవితా ప్రసవామధిపతిః సవణవత్వస్మిన్ బ్రహ్మ
ణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం పురోధాయా

మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం సవిత్రే ప్రసవానామధి పతయే। ఇదన్నమమ॥ ౧౩॥

ఓం రుద్రః పశూనామధి పతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యా మాశిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదంరుద్రాయ పశూనామధి పతయే ఇదన్నమమ॥ ౧౪॥

ఓం త్వష్టా రూపానామధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేస్యామా శిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం త్వష్ట్రే రూపానామధిపయే ఇదన్నమమ॥ ౧౫॥

ఓం విష్ణుః పర్వతానామధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామా శిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా॥ ఇదంవిష్ణవే పర్వతానామధిపతయే ఇదన్నమమ॥ ౧౬॥

ఓం మరుతో గణానామధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామా శిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా। ఇదం మరుద్భ్యో గణానామధిపతిభ్యః ఇదన్నమమ॥ ౧౭॥



ఓం పితరఃపితామహాః సర్వేవరే తతాస్తతా మహాః ఇహామావన్త్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేఽస్యామా శిష్యస్యాం పురోధాయామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాం స్వాహా॥ ఇదంపితృభ్యః పితామహేభ్యః వరేభ్యో వరేభ్యస్తతేభ్యస్తతామహేభ్యశ్చ ఇదన్నమమ॥ ౧౮॥

ఈప్రకారము ౧౮ అజ్యాహుతులిచ్చి అభ్యాతన హోమము జేసిన తరువాత:—ప్రభః, ఓం అగ్నిరైతుప్రథమో దేవతానాం సోఽస్యైప్రజాంముంచతు మృత్యుపాశాత్। తదయంరాజా వరుణోఽనుమన్యతాం యథేయం స్త్రీపౌత్రమఘన్నరోదాత్ స్వాహా॥ ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౧॥

ఓం ఇమామగ్నిస్త్రాయతాం గార్హపత్యః ప్రజామస్యై న యతుదీర్ఘమాయుః అశూన్యోపస్థి జావతామస్తు మాతా పౌత్రమానంద మభివిబుధ్యతామియం స్వాహా। ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౨॥

ఓంస్వస్తినోఽగ్నే దివాపృథివ్యా విశ్వానిధేహ్యా యథాయజత్రయదస్యాం మయిదివిజాతం ప్రశస్తంతదస్మాసు ద్రవిణంధేహిచిత్రం స్వాహా॥ ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౩॥

ఓం సుగన్నుపంథా ప్రదిశన్నవహి జ్యోతిష్మద్ధ్యేహ్య జరన్న ఆయుః అస్మై తుమృత్యురమృతం మఆగాద్వైవస్వతోనో౽ అభయం కృణోతు స్వాహా। ఇదం వైవస్వతాయ ఇదన్నమమ॥ ౪॥

ఓం పరంమృత్యో౽ అనుపరేహి పంథాం యత్రనో అన్య ఇతరో దేవయానాత్ చక్షుష్మతే శృణ్వతేతే బ్రవీమి మానః ప్రజా రీరిషోమోత వీరాన్ స్వాహా। ఇదం మృత్యవే ఇదన్నమమ॥ ౫॥

ఓం ద్యౌస్తే పృష్ఠం రక్షతు వాయురూరూ అశ్వినౌ చ స్తనంధయన్తే పుత్రాన్ సవితాభిరక్షత్వావాససః పరిధానాద్బృహస్పతి ర్విశ్వేదేవా అభిరక్షంతు పశ్చాత్ స్వాహా। ఇదం విశ్వేభ్యో దేవేభ్యః ఇదన్నమమ॥ ౬॥

ఓం మా తే గృహేషు నిశిఘోష ఉద్ధావన్యత్ర త్వద్రుదత్యః సంవిశంతు మాత్వం దదత్యుర ఆవధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యంతీ ప్రజాం సుమనస్యమానాం స్వాహా। ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౭॥

ఓం అప్రజస్యాం పౌత్రమర్త్యపాప్మానముత వా అఘం శీర్ష్ణః స్రజమివోన్ముచ్య ద్విషద్భ్యః ప్రతిముంచామి పాశం స్వాహా। ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౮॥



ఈ యెనిమిది మంత్రములతో అజ్యాహుతు లియ్యవలెను.

తరువాత.

ఓం భూరగ్నయే స్వాహా॥ ఇదమగ్నయే ఇదన్నమమ.
ఓం భువర్వాయవే స్వాహా॥ ఇదం వాయవే ఇదన్నమమ.
ఓం స్వరాదిత్యాయ స్వాహా॥ ఇదమాదిత్యాయ ఇదన్నమమ॥

ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇదన్నమమ.

ఈ నాలుగు మంత్రములతో నాలు గాహుతు లియ్యవలెను. ఈ హోమము ముగించిన పిమ్మట వరుడు లేచి పూర్వాభిముఖముగానున్న కన్యక కెదురుగా పశ్చిమాభిముఖుడై నిలిచి తన యెడమ చేతితో కన్య కుడిచేతిని పట్టుకొని ఈక్రింది మంత్రములు చెప్పవలయును.

పాణిగ్రహణ మంత్రములు.

ఓం గృహ్ణామి తేసౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్యథాసః। భగో౽ర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః॥ ౧॥

ఓం భగస్తేహ స్తమగ్రభీత్ సవితా హస్తమగ్రభీత్ ।
పత్నీత్వమసిధర్మణోహం గృహపతిస్తవ॥ ౨॥

మమేయమస్తు పోష్యామహ్యంత్వాదాద్బృహస్పతిః।
మయాపత్యా ప్రజావతి శంజీవ శరదః శతమ్॥ ౩॥

త్వష్టావాసో న్యదధాచ్ఛుభేకం బృహస్పతేః ప్రశిషా కవీనామ్ । తేనేమాం నారీంభవితా భగశ్చసూర్యమివ పరిధత్తాం ప్రజయా॥ ౪॥

ఇంద్రాగ్నీద్యావాపృథివీ మాతరిశ్వా మిత్రావరుణా భగో అశ్వినోభా బృహస్పతిర్మరుతో బ్రహ్మ సోమ ఇమాం నారీం ప్రజయా వర్ధయంతు॥ ౫॥

అహం విష్యామి మయి రూపమస్యా వేదదిత్పశ్య న్మనసా కులాయమ్ నస్తేయమద్మి మనసోదముచ్యే స్వయం శ్రంథానో వరుణస్య పాశాన్॥ ౬॥

ఈ ఆరు పాణిగ్రహణ మంత్రములు చెప్పి వధువును వరుడు పైకి లేపవలయును. వధూవరులతో కూడా కలశమును తీసుకొని హోమకుండ ప్రదక్షిణము చేసి ఈ క్రింది ప్రతిజ్ఞా మంత్రములు చెప్పవలెను.



## ప్రతిజ్ఞా మంత్రములు.

వరుడు:—ఓం అమోఽహమస్మి సాత్వం సాత్వమస్యమోఽహం సామాహమస్మి ఋక్త్వం ద్యౌరహం పృథివీత్వం తావేవ వివహావహై సహరేతో దధావహై। ప్రజాంప్రజనయావహై పుత్రాన్ విందావహై బహూ। తేసంతు జరదష్టయః సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ। పశ్యేమ శరదఃశతం జీవేమశరదఃశతం శృణుయామశరదఃశతం॥

ఇది అయిన తరువాత వరుడు వధువు వెనుక నిలిచి వధువుయొక్క కుడిహస్తమును వరుడు తన కుడి హస్తముతో పట్టుకొని నిలుచుండవలయును. వధువుయొక్క తల్లి లేక తోడబుట్టువులలో నొకరు పేలాలను తీసికొని వధువుయొక్క కుడి పాదమును యొక పన్నికలు లేక యేదైన నొక రాతిమీద నుంచునట్లు చేసిన తరువాత,

వరుడు:—ఓం ఆరోహేమమశ్మాన మశ్మేవత్వం స్థిరాభవ। అభితిష్ఠ పృతన్యతోఽవ బాధస్వపృతనాయతః॥

ఈ మంత్రము చెప్పి కుండమువద్దకు వచ్చి వధూవరు లిటువలె ముందు వెనకల నిలువబడిగాని ప్రక్కగా నిలువ

బడి క్రిందవరుని దోసిలియును అందుపైన వధువు దోసిలియును యేకముగా నుంచుకొని నిలువవలయును, వారి దోసిళ్లలో లాజలు పేలాలు నిండుగా పోసి వానిపైని నేతిని వేయవలయును, అ తరువాత వధూవరులుగాని వరుడుగాని ఈక్రింది మంత్రములతో, ఆహుతి యియ్యవలయును.

ఓం అర్యమణందేవంకన్యా అగ్నిమయక్షత సనో అర్యమా దేవః ప్రేతో ముంచతు మాపతేః స్వాహా। ఇదమర్యమ్ణే అగ్నయే ఇదన్నమమ॥ ౧॥

ఓం ఇయంనార్యుపబ్రూతే లాజానావపంతికా। ఆయుష్మానస్తుమే పతిరేధంతాం జ్ఞాతయో మమ స్వాహా। ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౨॥

ఓం ఇమాంలాజానావపామ్యగ్నౌ సమృద్ధికరణం తవ మమతుభ్యంచ సంవదనం తదగ్నిరనుమన్యతామియం స్వాహా। ఇదమగ్నయే ఇదన్నమమ॥ ౩॥

ఈ మూడు మంత్రములతో నొక్కొక్క మంత్రమునకొక్కసారి ప్రకారముగా కొంచెము కొంచెము పేలాలను ఆహుతి యియ్యవలయును. అట్లు యిచ్చిన తర్వాత వరుడు:—



ఓం సరస్వతి ప్రేదమవసుభగే వాజినీవతి। యాంత్వా విశ్వస్యభూతస్య ప్రజాయామస్యాగ్రతః। యస్యాంభూతం సమభవద్యస్యాం విశ్వమిదంజగత్। తామద్యగాథాం గాస్యామియా స్త్రీణా ముత్తమంయశః॥ ౧॥

ఈ మంత్రము చెప్పి వధువు యొక్క హస్తాంజలిని వరుడు తనహస్తాంజలితో పట్టుకొని॥

ఓం తుభ్యమగ్నే పర్యవహన్ సూర్యాం వహతునా సహ పునఃపతిభ్యో జాయాందాగ్నే ప్రజయాసహ॥ ౧॥

ఓం కన్యలాపితృభ్యః పతిలోకం పతీయమ పదీక్షామయష్ట। కన్యాఉత త్వయావయం ధారాఉదన్యా ఇవాతి గాహే మహిద్విషః॥ ౨॥

ఈ మంత్రములు చెప్పి యజ్ఞకుండమునకు ప్రదక్షిణము చేసి పశ్చిమ దిక్కున పూర్వాభిముఖులై కొంతసేపు వధూవరు లిద్దరును నిలిచియుండి, మరల, కలశ యుక్తముగా ప్రదక్షిణముచేసి ఈరీతిగా నిలిచి నిలిచి నాల్గు ప్రదక్షిణములుచేసి, పశ్చిమ దిక్కున పూర్వాభిముఖులై నిలువవలయును. తర్వాత మిగతగానుండిన పేలాలు వధువుయొక్క దోసిలిలో వేయువలెను. అప్పుడు

వధువు:—ఓం భగాయ స్వాహా॥ ఇదం భగాయ ఇదన్నమమ॥

అని చెప్పి ఒక ఆహుతి యియ్యవలెను. వరుడు వధువును దక్షిణ దిక్కున నిలిపి తాను కుండమునకు పశ్చిమమున పూర్వాభిముఖుడై కూర్చుండి,

ఓం ప్రజాపతయే స్వాహా । ఇదం ప్రజాపతయే ఇదన్నమమ॥

ఈమంత్రము చెప్పి ఒక ఆజ్యాహుతి యిచ్చి ఆతరువాత వధూవరులిద్దరును ఏకాంతస్థలమునకు వెళ్ళివధువుయొక్క కేశ బంధమును ఈక్రింది మంత్రములతో విప్పవలయును.
ప్రత్వా ముంచామి వరుణస్యపాశాద్యేనత్వా బధ్నాత్స వితా సుశేవః బూతస్యయోనౌ సంకృతస్యలోకేకరిష్ఠ న్వాసమాపత్యాదధామి॥ ౧॥ ప్రేతో ముంచామినా మత స్సుబద్ధా మముతస్కరమ్ యథేమింద్రమీఢ్వః సుపుత్రా సుభగాసతి॥ ౨॥ ఈ మంత్రములతో కొప్పును విప్పిన తరువాత సభామంటపమునకు వచ్చి సప్తపదివిధి నాచరించవలెను.



## స ప్త ప ది.

వధూవరులు కుండమువద్ద ఉత్తరాభిముఖులుగా నిలుచుండవలయును. తరువాత వరుడు,

మాసవ్యేన దక్షిణమతిక్రామ॥ అని చెప్పి వధువు తన కుడిపాదమును ముందుగా పెట్టి నడుచుటకు ఆజ్ఞ యిచ్చి, ఓం ఇషఏక పదీభవసా మామనువ్రతాభవ విష్ణుస్త్వానయతుప్రత్రాన్ విందావహైబహూంస్తే సంతుజరదష్టయః॥ ౧॥

ఈ మంత్రము చెప్పి వధువును తనవెంట పిలుచుకొని ఈశాన్య దిక్కునకు నడచుటకు యత్నించి,

ఓం ఊర్జేద్విపదీ భవ॥ అనిచెప్పి ,, రెండవ అడుగు [పెట్టవలెను,

ఓం రాయస్పోషాయత్రిపదీ భవ ,, మూడవ పాదము [పెట్టవలెను,

ఓం మయోభవాయ చతుష్పదీ భవ,, నాల్గవ పాద [ముంచవలెను,

ఓం ప్రజాభ్యః పంచపదీ భవ ,, అయిదవ అడుగు [పెట్టవలెను,

ఓం ఋతుభ్యః షట్పదీ భవ ,, ఆరవ పాదము [నుంచవలెను,

ఓం సఖే సప్తపదీ భవ ,, ఏడవ పాదము [నుంచవలెను.

ఈ ప్రకార మొక్కొక్క మంత్రమున కొక్కయడుగు చొప్పున నడవవలయును "భవ" అను పదము చెప్పునపుడు అడుగు నుంచవలయును. అక్కడ వధూవరులు కూర్చున్న తరువాత వారిపైన కలశములోని జలమును ప్రోక్షించవలయును, తరువాత వరుడు:—

ఓం ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన మహేరణాయచక్షసే॥ ౧॥ యోవః శివతమోరసస్తస్యభాజయతే హనః ఉశతీరివమాతరః॥ ౨॥ తస్మా అరం గమామ వో యస్యక్షయాయ జన్వథ ఆపో జన యథా చనః॥ ౩॥ ఓం అపః శివాః శివతమాః శాంతాః శాంతతమాస్తాస్తే కృణ్వంతు భేషజం॥ ౪॥

ఈ నాలుగు మంత్రములు చెప్పి వధూవరులు యిద్దరును లేచి నలుదిక్కుల,

ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ । పశ్యేమశరదః శతం జీవేమశరదః శతం శృణుయామశరదః



శతం ప్రబ్రవామశరదః శతమదీనాః స్యామశరదః శతం భూయశ్చ శరదశ్శతాత్॥ ౧॥

ఈ మంత్రము చెప్పి సూర్యుని అవలోకించి అటు తరువాత వధువుయొక్క దక్షిణ స్కంధముపైనుంచి తన దక్షిణ హస్తముతో వధువు హృదయమును స్పర్శచేసి:—

ఓం మమవ్రతే తేహృదయం దధామి మమ చిత్తమను చిత్తం తేఅస్తు మమవాచమేకమనాజుషస్వప్రజాపతిష్ట్వానియునక్తు మహ్యామ్॥

ఈ మంత్రము చెప్పవలయును.

ఆలాగే వధువున్ను వరుని హృదయమును తాకి పై మంత్రమునే చెప్పవలయును.

ఆ తరువాత వరుడు వధువు శిరస్సునందు హస్తము నుంచి:—

సుమంగలీరియం వధూరిమాంసమేత పశ్యత సౌభాగ్యమస్యైదత్వాయాథాస్తం విపరేతన॥

ఈ మంత్రము చెప్పి చూడవచ్చిన వారిని అందరిని చూడవలయును.

అప్పుడచ్చట వచ్చిన వారందరును:—
(స్త్రీ పురుషు లందరును.)

ఓం సౌభాగ్యమస్తు । ఓం శుభం భవతు॥ అని చెప్పి, ఆశీర్వదించ వలయును.

తరువాత వధూవరులు యజ్ఞకుండము వద్దకు వచ్చి "ఓం యదాస్య కర్మణో" అను స్విష్టకృత మంత్రముతో నొక ఆజ్యాహుతి యిచ్చి "ఓం భూరగ్నయే స్వాహా" అను నాలుగు మంత్రములతో నాలుగు ఆహుతులిచ్చి వధూవరులు కొంతసేపు విశ్రామము నిమిత్తమై వెళ్ల వలయును.

## వివాహోత్తర విధి.

సూర్యాస్తమయిన తరువాత వివాహము యొక్క ఉత్తర విధిని కన్య యింటిలో జరుపవలయును.

వధూవరులు యజ్ఞగుండమువద్దకువచ్చి యథాస్థాన మందు కూర్చుండి, అగ్న్యాధానమును, సమిధా ధాన మును పూర్వప్రకారమే చేసి,

ఓం అగ్నయే స్వాహా—ఇత్యాది నాలుగు మంత్ర ములతో నాలుగున్ను, ౭౩-పుటలో జూడుఁడు.



ఓం భూరగ్నయే స్వాహా—ఇత్యాది నాలుగు మంత్ర ములతో నాలుగు ఆహుతులిచ్చి ౭౬-పుటలోఁ జూడుఁడు.

ఈ క్రింది మంత్రములతో:—

ఓం లేఖాసంధిషు పక్ష్మస్వావర్తేషు చ యాని తే । తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం స్వాహా । ఇదం కన్యాయై ఇదన్నమమ॥

ఓం కేశేషు యచ్చ పాపకమీక్షితే రుదితే చ యత్ । తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం స్వాహా । ఇదం కన్యాయై ఇదన్నమమ॥

ఓం ఆరోకేషు దంతేషు హస్తయోః పాదయోశ్చ యత్ । తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం స్వాహా । ఇదం కన్యాయై ఇదన్నమమ॥

ఓం ఊర్వోరుపస్థే జంఘయోః సంధానేషు చ యాని తే। తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం స్వాహా । ఇదం కన్యాయై ఇదన్నమమ॥

ఓం యాని కాని చ ఘోరాణి సర్వాంగేషు తవాభవన్ పూర్ణాహుతిభిరాజ్యస్య సర్వాణి తాన్యశీశమం స్వాహా। ఇదం కన్యాయై ఇదన్నమమ॥

ఈ ఆరు మంత్రములతో ఆరు ఆజ్యాహుతులు యిచ్చి మరల ఓం భూరగ్న యే స్వాహాది నాలుగు మంత్రములతో నాలు గాహుతు లియ్యవలయును.

ఆ తరువాత వరుడు:—

ధృవంపశ్య అని చెప్పి వధువుకు నక్షత్రములు చూపవలెను పశ్యామి అని వధువు చెప్పి నక్షత్రములను చూచుచు: వధువు: ఓం ధ్రువమసి ధృవాహంపతికులే భూయాసమ్* (అముష్య ....................అను వరునకు అసౌ)..................................అను వధువు

వరుడు:—అరుంధతీంపశ్య!

వధువు:—పశ్యామి!

వరుడు:—

ఓం అరుంధత్యసి రుద్ధాహమస్మి (అముష్య అసౌ)

అముష్య పదస్థానమున వరుని పేరు షష్ఠ్యంతముగాను అసౌ పదస్థానమందు వధువుపేరు ప్రథమాంతముగాను

* (అముష్య పదస్థానమందు వరుని పేరు షష్ఠీవిభక్త్యంతముగాను అసౌ పదస్థానమందు తనపేరు అనగా వధువు పేరు ప్రథమాంతముగాను చేర్చి చెప్పవలయును).



చేర్చవలయును, పై మంత్రము చెప్పి వధువు మస్తకమందు వరుని హస్తముంచి

వరుడు:—ఓం ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీధ్రువం విశ్వమిదం జగత్ ధ్రువాసః పర్వతా ఇమే ధ్రువా స్త్రీ పతికులే ఇయం॥

ఓం ధ్రువమసి ధ్రువంత్వా పశ్యామి ధ్రువైధి పోష్యేమయిమహ్యంత్వాదాత్ బృహస్పతి ర్మయా పత్యా ప్రజావతీసంజీవశరదః శతం॥

ఈ మంత్రములు చెప్పి వధూవరులు యజ్ఞకుండము వద్ద పూర్వాభిముఖులై కూర్చుండి వెనుక చెప్పిన “ఓం అమృతోపస్తరణ-మసి స్వాహా” ఇత్యాది మూడు మంత్రములతో ఆచమనములు చేసి అగ్నిని ప్రజ్వలింపజేసి స్థాలీపాకము అనగా అన్నాదులును “ఓం అయంతఇధ్మ” అను నాలుగుమంత్రములతో సమిదాహోమము చేసి వధూవరు లిద్దరును వెనుక చెప్పిన ప్రకారము నాలుగు ఆఘారావాజ్యభాగాహుతులున్ను, నాలుగు వ్యాహృతి ఆహుతులున్ను యిచ్చి, తరువాత అన్నమున్ను నేతిని కలిపి ఆహుతి యియ్యవలయును. ఇందుకు మంత్రములు.

ఓం అగ్నయే స్వాహా। ఇదమగ్నయే ఇదన్నమమ॥
ఓం ప్రజాపతయే స్వాహా।ఇదంప్రజాపతయే ఇదన్నమమ॥
ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా। ఇదం విశ్వేభ్యో
దేవేభ్య ఇదన్నమమ॥

ఓం అనుమతయే స్వాహా। ఇదమనుమతయే । ఇద
న్నమమ॥

ఈ మంత్రములతో స్థాలీపాక ఆహుతులు నాలు గి
య్యవలెను.

తరువాత (ఓం యిదస్య కర్మణో) అను మంత్రముతో
నొక స్విష్టకృత్ ఆహుతిని, నాలుగు వ్యాహృతి ఆహు
తులున్ను,అష్టాజ్యాహుతులున్ను, అన్నియుకలిసి పంద్రెం
డు ఆజ్యాహుతులున్ను, యిచ్చి తరువాత,

ఓం సర్వం వై పూర్ణ స్వాహా॥ ఈ మంత్రముతో
పూర్ణాహుతి యియ్యవలెను. తరువాత మిగిలిన అన్నా
దులు నేతితో కలిపి కుడిచేతియందు ధరించి (పాత్ర
లో) వరుడు.

ఓం అన్నపాశేన మణినా ప్రాణసూత్రేణ పృశ్నినా।
బధ్నామి సత్యగంధినా మనశ్చ హృదయంచ తే॥ ౧॥



ఓం యదేతద్ధృదయం తవ తదస్తు హృదయంమమ
యదిదంహృదయంమమ తదస్తు హృదయం తవ॥ ౨॥

ఓం అన్నం ప్రాణస్య షడ్వింశ స్తేన బధ్నామి త్వా
అసౌ॥ ౩॥

ఈ మూడు మంత్రములు మనసులో జపించి తాను
కొంచెము భక్షించి మిగతను వధువుకు యియ్యవలెను.
వధువును భక్షించి పరిశుద్ధులై యిద్దరును మంటపమందు
సిద్ధపరచబడిన ఆసనములమీద కూర్చుండి ఈక్రిందివిధ
మున సామవేదోక్త మహానామదేవ్య గానము చేయ
వలయును.

ఓం భూర్భువ స్స్వాహా కయానశ్చిత్ర ఆభువధూతీ సదా
వృధః కయాశచిష్టయావృతా॥ ౧॥

ఓం భూర్భువః స్వాహా కస్త్వాసత్యోమదానాం
మహిష్టో మత్సదంధసః। దృఢాచిదారుజవసు॥ ౨॥

ఓం భూర్భువః స్వాహా। అభీషుణః సఖీనామవితాజరి
తౄణామ్। శతంభవాస్యూతయే॥ ౩॥

* మహావామదేవ్యమ్। కౌ౽హ్శయా। నశ్చా3 ఇత్రా3
ఆభునాత్ ।ఊ।తీసదావృధఃసఖా। ఔ3హోహాఈ।కయా

* మంత్రములలో వచ్చె అంకెలు స్వరములయొక్క మాత్రలను

ఉ౩శ్చాఞ్ఞర్యాహా౩ హుమ్మా౨। వా౨ర్తో ౩ఉ౨ఇ।
హా౩॥ ౧॥ కా౨ఇ స్త్వాసత్యో౩మా౩ దానామ్। మా
హిష్ఠోమూత్సాదంధ। సా। కా౩హోహాఇ దృఢా౨౩ చిదా
రుజే హా౩। హుమ్మా౨ వా౨౩సో౩౨ఇ హాయి॥ ౨॥
ఆ౨ఇభీషుణా౩ సా౩ స్వీనామ్। ఆ వితాజరాయి తృణా
మ్। శ౨౩ హేహాయి శతా౨౩ మ్భవా। సియాహా౩
హుమ్మా౨ తా౨౨యో౩౨ఇహాయి॥ ౩॥ సామ॥
ఉత్తరార్చికే॥ అ౧॥ ఖం ౩॥ మం. ౧-౨-౩॥

ఇట్లు సామగానముగాని భజనమంతలిమూలముగా గాని ఈశ్వర ప్రార్థనముగించి వధూవరులు క్షారలవణాది రహితమై మృష్ట దుగ్ధ ఘృతాది సహితముగా భోజనము చేసి వచ్చినవారిని భోజనాదులవలన సత్కరించి పంపవలయును. తరువాత వధూవరుల అభీష్టప్రకారము వారిష్టపడినదినమున గర్భాధానవిధిని ఆచరించవలయును.

వధువును వరుని యింటికి పంపునపుడు వధువుకండ్లలో నీరు వచ్చును, లేక కించిత్తు వ్యథగా నైన నుండును.

అప్పుడు వరుడు:...

జాపుచున్నది దీనిలో, ఉప్పులేనుండు దానిని మాత్రము ఆహారముగా సెంచుకొనవలెను.



జీవం వదంతి విమయం తే అధ్వరే దీర్ఘాః మను ప్రసిద్ధిః ధీధియున్నరః। వామః పితృభ్యో। య ఇదం సమ్మేరిరే మయః పతిభ్యో జనయే పరిష్వజే॥

ఈ మంత్రము చెప్పి వరుడు తన ప్రక్కన కూర్చుండబెట్టుకొనవలయును.

పూషాత్వేతో నయతు హస్త గృహ్యాశ్వినాత్వా ప్రవహతాం రథేన। గృహాన్ గచ్ఛ గృహపత్నీ యథాసో వశినీత్వం విదథమావదాసి॥ ౧॥ సుకిమ్శుకమ్ శల్మలిం విశ్వరూపం హిరణ్యవర్ణ సువృతం సుచక్రం। ఆరోహ సూర్యే అమృతస్యలోకం స్యోనంపతే బహతుం కృణుష్వ॥ ౨॥ ఈ రెండు మంత్రములు చెప్పి రథము తన యింటికి నడిపింప వలయును.

వధూవరులు విదేశజులై యుండిన యెడల సముద్ర మీద పోవలసినప్పుడు నావపైని యెక్కునపుడు వరుడు:—

అశ్మన్వతీరీయతె సంరమధ్వనుతిష్ఠత ప్రతరతా సఖాయః అను మంత్రము చెప్పి ఓడపైకి యెక్కవలయును.

నావనుండి దిగునప్పుడు:—

ఆ(త్రాజహోమయే అసన్న శేనాః శివాన్ వయముత్త రేమాభినాజాన్। ఈ మంత్రమును జెప్పి ఓడ నుండి దిగ వలయును.

మార్గమందు యేవిధమయిన భయము కలిగినను అప్పుడు మావిదన్ పరిపంథీనోయ ఆసీదంతీ దమ్పతీ సుగేభిర్దుర్గమతీతామ పద్రాంత్వరాతయః॥ ఈ మంత్ర మును చెప్పవలెను.

మార్గమధ్యమందేమైనను తొందరగాని, విఘ్నము గాని సంభవించినయెడల సురక్షితమైన స్థలమందు దిగి వెంటకొనివచ్చిన వివాహాగ్నిని వెలుగజేసి అందులో నాలుగు (౪) వాహృతి ఆజ్యాహుతులును యిచ్చి తరు వాత ప్రయాణము చేయవలయును.

ఇల్లు చేరిన తరువాత వరుని పక్షము వారెవరయిన సంతానవతి సలక్షణ వతియునైన స్త్రీ వచ్చి వధువును జేయి పట్టుకొని దింపవలెను.

అప్పుడు వచ్చిన జనులను గురించి వరుడు:—

సుమంగలీరియం వధూరిమాంకసమేత పశ్యత। సౌభా గ్యమిస్యైదత్వా।యాథా స్తంవిపరేతన॥ ౧॥ ఈ మంత్ర మును చెప్పవలెను.



ఓం సౌభాగ్య మస్తు, ఓం శుభం భవతు॥ అని ఆశీర్వ దించవలెను. తదనంతరము వరుడు:—

ఇహప్రియం ప్రజయా తే సమృధ్యతామస్మిన్ గృహే గార్హ పత్యాయ జాగృహి। ఏనాపత్యాతన్వం సంస్పృజ స్వాధా జిబ్రీవిదథమాపదాథః। అను మంత్రమును చెప్పి వధువును సభామంటపమునకు తోడ్కొని పోయి అక్కడ సిద్ధపరచియుండిన యజ్ఞకుండము సమీపమున పూర్వాభిముఖమై కూర్చుండి:—

ఓం ఇహగావః ప్రజాయధ్వామిహాశ్వా ఆహాపూ రు షాః। ఇహోసహస్రదక్షిణోపి పూపానిషీదతు॥ అని చెప్పి వధువును దక్షిణభాగమందు పూర్వాభిముఖముగా కూర్చుండబెట్టి.

ఓం అమృతోప స్తరణమసి॥ ఇత్యాది మంత్రములతో ఆచమనముచేసి తరువాత సమిదాదాన, అగ్న్యాదాన ములు చేసి నాలుగు (౪) వ్యాహృతి ఆహుతులును, ఆధారా నాజ్యభాగాహుతులు (౪) నాలుగున్ను, అష్టా జ్యాహుతులున్ను యిచ్చి హోమమును ఈక్రింది మంత్ర ములతో ప్రారంభించ వలయును.

### ప్రధాన హోమము.

ఓం ఇహధృతిఃస్వాహా । ఇదమిహధృత్యై । ఇదన్నమమ॥
ఓంఇహస్వధృతిస్వాహా।ఇమిహ స్వధృత్యై ఇదన్నమమ॥
ఓం ఇహరంతిఃస్వాహా।ఇదమిహరంత్యై - ఇదన్నమమ॥
ఓం ఇహరమస్వస్వాహా।ఇదమిహరమాయ- ఇదన్నమమ॥
ఓం మయిధృతిఃస్వాహా।ఇదంమయిధృత్యై - ఇదన్నమమ॥
ఓం మయిర్బధృతిఃస్వాహా।ఇదంమయిస్వధృత్యై- ఇదన్న మమ॥
ఓంమయిరమఃస్వాహా।ఇదంమయిరమాయ- ఇదన్నమమ॥
ఓంమయిరమస్వ స్వాహా । ఇదం మయిరమాయ - ఇద న్నమమ॥

ఒక్కొక్క మంత్రమున కొకటి చొప్పున (౮) ఎనిమిది ఆజ్యాహుతులిచ్చి, మరియు,

ఓం ఆవః ప్రజాంజనయతు ప్రజాపతి రాజరసాయ సమన క్త్వర్యమా। అదుర్మంగలీః పతిలోకమావిశశన్నో భవద్విపదేశం చతుష్పదే స్వాహా। ఇదంసూర్యాయై సావిత్రై-ఇదన్నమమ॥ ౧॥

ఓంఅఘోరచక్షుర పతిఘ్నో ర్యధిశివా పశుభ్యః సుమ నాః సువర్చాః । వీరసూర్దే వృకామాస్యోనాశన్నో భవ



ద్విపదేశం చతుష్పదే స్వాహా॥ ఇదం సూర్యాయై సావిత్రై - ఇదన్నమమ॥ ౨॥

ఓం ఇమాంత్వమింద్రమీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు । దశాస్యాం పుత్రానాధేహి పతిమేకాదశం కృధి స్వాహా॥ ఇదంసూర్యాయై సావిత్రై ఇదన్నమమ॥ ౩॥

ఓం సమ్రాజ్ఞీశ్వశురే భవ సమ్రాజ్ఞీశ్వశ్ర్వాంభవ। ననాందరిసమ్రాజ్ఞీ భవసమ్రాజ్ఞీ అధిదేవృషు స్వాహా॥ ఇదం సూర్యాయై, సావిత్రై ఇదన్నమమ॥ ౪॥

ఈ నాలుగు మంత్రములకును మంత్రమున కొకటి వంతున నాలుగు(౪) ఆజ్యాహుతు లిచ్చి, ఒక హోమా హుతియును, నాలుగు వాహ్యతి ఆజ్యాహుతులును, ఒక ప్రాజాపత్యాహుతియును, అంతు (6)ఆరు ఆహుతు లిచ్చి, పిమ్మట:—

సమజంతు విశ్వేదేవాః సమాపోహృదయానినౌ ।
సం మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతునౌ॥

ఈ మంత్రమును చెప్పి వధూవరు లిద్దరును దధి ప్రాశ నము అనగా పెరుగును, అన్నమును భక్షించవలయును. తదనంతరము:—

అహంభో అవాదయామి॥

ఈవాక్యమును చెప్పి వధూవరు లిద్దరును మాతా పిత వృద్ధజనులకు నమస్కారములుచేసి, పురోహితాది పెద్ద లను గురించి:—

ఓం స్వస్తి భవంతో బ్రువంతు॥ అని స్వస్తివాచకపాఠములు, వధూవరులును, పురోహితులు, పెద్దలు, మొదలయిన వారందరును చదివిన తరువాత వచ్చిన స్త్రీ పురుషుల నందరిని గూర్చి:—

ఓం స్వస్తి! ఓం స్వస్తి!! ఓం స్వస్తి!!!

ఈ వాక్యమును చెప్పి వారివారికి తగినట్లు సత్కరించి పంపవలయును.

వివాహ సంస్కారానంతరము నాల్గవ దినమున గర్భాదాన సంస్కార మాచరిచుట యుత్తమము. అథవా అది ఋతుకాలము కానియెడల యే దినమంచయినను గర్భాదాన విధిని ఆచరించవలయును.

గర్భాదాన విధి.

ఈ వివాహ పద్ధతి స్త్రీ పురుషులు పరస్పర సహాయముతో గృహాశ్రమమును ప్రసన్న పూర్వకముగా జరు



పుటకుగాను యేర్పడినది, గనుక దంపతులు తమ వివాహ బంధన మందలి నిర్మాణములను మీరక సత్ సంతానముల బడసి కృతకార్యులై తదనంతరము సంసార భారమును యోగ్యులగు పుత్రుల కప్పగించి తాము వానప్రస్థాశ్రమమును స్వీకరించి, సార్థక జన్ములై ముక్తిని పొందుదురు గాత!

ఇతి వివాహ సంస్కార విధి సమాప్తః.

# వివాహముయొక్క లక్షణము.

బ్రాహ్మోదైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః ।
గాంధర్వో రాక్షస శ్చైవ పైశాచ శ్చాష్టమోధమః॥
మను. 3-21.

వివాహము 8 (ఎనిమిది) ప్రకారములు.

1. బ్రాహ్మము—కన్యావరు లిద్దరును యథారీతిని బ్రహ్మచర్యముచే పూర్ణవిద్వాంసులును, ధార్మికులును, శుశీలురునై పరస్పర ప్రసన్నతచే వివాహమాడుట.

2. దైవము—విస్తారమగు యజ్ఞకార్యమందు ఋత్విక్కర్మ చేయుచుండు అల్లునికి అలంకారయుక్తరాలగు కన్యనిచ్చుట.

3. ఆర్షము— వరుని నుండి యేమైనను కొంచెము పుచ్చుకొని వివాహము చేయుట

4. ప్రాజాపత్యము—ధర్మమును వృద్ధిపరచు నిమిత్తము యిద్దఱును వివాహమాడుట.



5. అసురము—కన్యా వరులకు నీమేని కొంత యొసగుటచే వివాహమాడుట.

6. గాంధర్వము—నియమ సమయము లేక యేదియో ఒక కారణముచేత కన్యా వరులు, యిచ్ఛా పూర్వకముగా పరస్పరము సంయోగమగుట.

7. రాక్షసము—జగడమాడి బలాత్కారముగా అనగా యీడ్చుకొని వచ్చి, అథాటున గాని, మోసముచే గాని కన్యను గ్రహించుట.

8. పైశాచము—నిదురించునట్టి గాని, త్రాగి మైమఱచినట్టి గాని, పిచ్చిపట్టినట్టి గాని, కన్యతో బలాత్కారముగా సంయోగము చేయుట.

(1) ఈవివాహములన్నిటిలో బ్రహ్మవివాహము సర్వోత్కృష్టము.

(2) దైవ, ప్రాజాపత్యములు, మధ్యమము.

(3) ఆర్షము, అసురము, గాంధర్వము, నికృష్టము.

(4) రాక్షసము, అధమము.

(5) పైశాచము, మహాభ్రష్టము.

1. వేదరీతిగా చూచినయెడల మాంగల్యసూత్ర ధారణమునకు లగ్ననిర్ణయము లేకయున్నది. ఏలనగా లగ్ననిర్ణయ ప్రకారము ప్రజలు అనుభవించుట లేదు. గాని పూర్వకర్మఫలప్రకారము తప్పక అనుభవించుచున్నారు. వేమన యోగీశ్వరుడు చెప్పినప్రకారముగా "ముహూర్తంబు నిజమైతే ముండేల మోసెరా" అనునట్లున్నది.

2. స్త్రీలకు వివాహసంస్కారకాలమందే ఉపనయనమగుచున్నది. గాన ప్రత్యేక ఉపనయన మనవసరము.

---

# నవగ్రహ నిర్జీవ నిరూపణము.

సూర్యచంద్రాదు లనబడు నవగ్రహములు అనగా 9 లోకములని వేదములో చెప్పియుండు నట్లుగానే (Science) శాస్త్రములోగూడ గోళము లనియే నిరూపింపబడియున్నవి. మఱియు అందుకు తోడుగా ఆర్యుడగు శాయనాచార్యులు వ్రాసియుండు సిద్ధాంత శిరోమణియను గ్రంథములోకూడ సూర్యచంద్రాదులు



జడపదార్థము లనగా ప్రాణములేని గోళములనియే సిద్ధాంతపరపబడియున్నవి.

మన పురాణరీతిగా నవగ్రహములు జీవము గలవని చెప్పుచున్నది. మన పౌరాణికులు చెప్పునట్లుగా, నవగ్రహములు జీవముగలవై యుండిన ఎడల జీవముగల ప్రతిజంతువునకు, విరామము, ఆహారము, నిద్ర మొదలగు వ్యవహారములకు యెడముండవలయును. అట్లు లేదు కాబట్టి నిర్జీవపదార్థము లనియే నిర్ణయించవలసియున్నది.

1. ఇదియును గాక సూర్యుని గురించి వేదములో సప్తాశ్వములు గలవాడని చెప్పియుండుటను పట్టి పౌరాణికులు అలంకారార్థము అని భావింపక, ఏడు గుఱ్ఱములు గలవాడని, తప్పుఅర్థమును గ్రహించిరి. నిరుక్తప్రకారము చూచినయెడల ఏడురంగులని ఆర్యులు వ్యాఖ్యానము చేసిరి. మరియు బజారులలోని పటములలోకూడ సప్తాశ్వములనగా ఏడుగుఱ్ఱము లనియే వ్యాఖ్యానమున్నది. కాబట్టి సూర్యుడు ఏడుగుఱ్ఱములు కలవాడనియే చిత్రపటములుకూడా అచ్చొత్తింపబడియున్నది.

2. మరియు బృహదారణ్యకోపనిషత్తునందు గర్గగోత్రోత్పన్నుడగు వాలాగికిన్ని, అజాతశత్రువునకున్ను

జరిగిన సంవాదములో, సూర్యచంద్రాదులలో ప్రతీక (ఈశ్వర) యుపాసన చేయకూడదని విస్పష్టముగానున్నది. ఇట్లుండగా వేదవిరుద్ధముగా కాష్ట లోహాది జడపదార్థములలో ప్రతీక యుపాసనచేయవచ్చునని యెట్లు చెప్పవచ్చును. ఇట్లు చెప్పుట యెట్లున్నదనగా జగద్భరితుడు యెక్కడ నున్నాడనగా మాయింటిలోనే ఉన్నాడనునట్లున్నది. మరియు "నిర్వాసమునకు పుష్పము సమర్పింపుము—అనంతునకు అక్షతలు వేయుము—స్వయంప్రకాశమానునకు దీపము నుంచుము—నిరాలంబునకు యజ్ఞోపవీతము వేయుము.— విశ్వోదరునకు వస్త్రము నిష్ప్రముము" యను ఉన్మత్త ప్రలాపమువలె యున్నది.

**3.** ఇదిగాక ఆకాశములో అగుపడు నక్షత్రములో ఒక్కటిని అరుంధతి యని సిద్ధాంత గణితశాస్త్రములో, పేర్కొనబడి యుండుటనుబట్టి పౌరాణికులు అరుంధతి అను శబ్దమునకు ఒక మాదిగజాతి స్త్రీయనియు, నామె గతించిన పిమ్మట ఆకాశములో నక్షత్రమై వెలుగుచున్నదని కూడ కల్పించియున్నారు. అది సృష్ట్యాదిలోనే భగవంతునిచే నిర్మింపబడియున్నవని గ్రహింపక పురాణసృష్టి



కాలములో అనగా 5,000 సంవత్సరములకు ముందుగా కల్పింపబడినదని గ్రహింపక యున్నారు.

4. సూర్యుడు భూలోకమునకు దిగివచ్చి కుంతీదేవిని రమించిపోయినట్లుగా చెప్పుచున్నారు గదా? సూర్యుడు నిజముగా భూలోకమునకు దిగివచ్చి యుండినయెడల సముద్రములోని నీరంతయు ఇంకిపోయి యుండవలసి వచ్చును. అట్లు లేదు, కాబట్టి ఇట్లుచెప్పుట సర్వ అబద్ధము.

5. సూర్యుడు తన కక్షలో తాను ఆత్మ ప్రదక్షిణము 15 దినముల కొక్కసారి చేయుచున్నాడు అనగా బొంగరమువలె తిరుగుచున్నాడని భావము. మన ఆసియా ఖండములోని పగలు పాతాళమనబడు అమెరికా ఖండవాసులకు రాత్రిగా యున్నది

## న వ గ్ర హ స మీ క్ష.

కాలామృత గ్రంథ ప్రమాణము చొప్పున గురు-శుక్రులు బ్రాహ్మణులు, సూర్య - అంగారకులు క్షత్రియులు, చంద్ర- బుధులు వైశ్యులు,శని శూద్రగ్రహమని యున్నది. ఈజాతి చతుష్టయము వ్రాసినదానిని మీరు నమ్మరా? అట్లుండగా భువన దీపికలో, బుధుడు

శూద్రుడనియును, రాహు - శనైశ్చరులు, మ్లేచ్ఛులనియు కలదు. ఇందేది నిజము. భాగవత రీత్యా చంద్రుడు, అత్రిమునికి అనసూయయందు కలిగినవాడు, బ్రాహ్మణులకు జన్మించిన చంద్రుడు, వైశ్యుడయ్యెను. వైశ్యుడగు చంద్రుని పుత్రుడు శూద్రుడయ్యెను. సూర్యుడు క్షత్రియుడు, అతని పుత్రుడు శనైశ్చరుడు శూద్రుడు అథవా మ్లేచ్ఛుడయ్యెను. ఇందేది నిజము? వర్ణకారకములు గ్రహములలోనే పరివర్తనము కలదు. శుక్రుడు, భృగుముని పుత్రుడు. సౌరపురాణమున సింహికాగర్భమున బాణాసురునకు గలిగినవాడు రాహువు. రాహువుయొక్క ఛాయయే కేతువనియున్నది. పురాణ ప్రమాణములవలన భరద్వాజ పుత్రుడు అంగారకుడు, అత్రిముని అనసూయను వివాహమాడి చంద్రుని కనకయుండినప్పుడున్న, చంద్రుడు బుధుని కనక యుండినప్పుడున్న, సూర్యుడు శనైశ్చరుని బడయక యుండినప్పుడున్న, గ్రహములెన్ని. వీరుజన్మించక పూర్వము జన్మకుండలిలో యెన్నిగ్రహములు వ్రాయబడుచుండెను. ఇది సనాతనమని వ్రాసిన వారికి సిగ్గుగలదా? నవగ్రహ పూజ మ్లేచ్ఛ పూజచేయువారనిన లజ్జయుండదా. ఈశూద్రో



పాసకులు వర్ణములు నాలుగు వేరుగా ప్రతివ్యక్తియందును యోగ్యమై యున్నవని తెలియజాలక, వర్ణ ముపనయన కాలమందు వచ్చునా లేక స్నాతక సమయమందు వచ్చునా యని శుశ్శంకల పాలయిరి. ఇదిగాక,

హిందూ జ్యోతిష్కులు చంద్రగ్రహమును పురుషుడుగాను,యవనజ్యోతిష్కులుస్త్రీనిగాను నమ్మినారు. హిందువులు శుక్రగ్రహమును దేవశత్రువని భావించియుండగా, యవనులు శుభగ్రహమని చెప్పుచున్నారు. హిందువులకు వ్యతిరేకముగా బుధ - శనైశ్చరులు నపుంసక గ్రహములని నమ్మియున్నారు.

మొదట యవనులలో నిది యున్నప్పుడు స్త్రీనిగా దలంచిన చంద్రగ్రహమును, హిందువులట్లే తలంచినయెడల, భాగవతములోని చంద్రుడు,గురుపత్నిని బొందిన చరిత్రకు భంగమేర్పడునని పురుషగ్రహముగా మార్చిరి.

మనము నిజస్థితిని తెలుసుకొనక మన పురాణములనమ్మి ఆ నిర్జీవలోకములను జాళ్లతో మానవాకృతి గల శిలలను నిర్మించి వాటిని గుళ్ళలోపూడ్పించి, వాటికి అలంకారములు, అభిషేకములు, మొదలగు షోడశోప

చారములు చేసి మనము ప్రార్జించునట్లుగా ఆ శిలలకు బ్రాహ్మణవేషధారులు ప్రాణమిప్పించి మూర్తికరము కలిగించుచున్నారమనుచున్నారు. వారుచెప్పెడు మాటలు నిజముగా నున్నయెడల అట్టివారి ఇండ్లలో మృతిబొంది యుండువారికెల్లరకు ఏల ప్రాణమిప్పించరైరి. ఇట్టిఆభాస విషయములను మూర్ఖులు నమ్ముదురేకాని జ్ఞానులు నమ్మరు.

అట్టి గోళములను ఫొటగ్రాపులుకూడా తీయబడి అచ్చొత్తించి యున్నారు. అట్టి లోకాంతరములుగల పటములు బజారులలో కూడ వెలకు చిక్కుచున్నవి. అడ్రసు, మెమోరియల్ హాల్ బుక్కుడిపో, మదరాసునకున్ను, గ్రంథకర్త,—కీర్తిశేషులైన రావుబహాదూరు కందుకూరు - వీరేశలింగం పంతులుగారు, రాజమహేంద్రవరము, రాజమండ్రి పోస్టు, అని వ్రాసి తెప్పించుకొన వచ్చును.

## మహాగణపతి స్తోత్రము.

శ్లో. శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే



శ్లోకార్థము—శుక్లాంబరధరం=తెల్లని వస్త్రమును ధరించినవాడును, విష్ణుం=విష్ణుస్వరూపుడును, శశివర్ణం=చంద్రునివంటి వర్ణముగలవాడును, చతుర్భుజం = నాలుగు భుజములు కలవాడును, ప్రసన్నవదనం = ప్రసన్నమైన ముఖము కలవాడును, (ఐనట్టివానిని) సర్వవిఘ్నోపశాంతయే - విఘ్న = సమస్త సర్వవిఘ్నములు, ఉపశాంతయే = ఉపశమించుకొరకు, ధ్యాయేత్ = ధ్యానించుచున్నాను.

మహాగణాధిపతయేనమః - ధ్యాయామి - ఆవాహయామి - ఆసనంసమర్పయామి - హస్తయోః అర్ఘ్యం సమర్పయామి పాదయోః పాద్యంసమర్పయామి-స్నానం సమర్పయామి - స్నానానన్తరం ఆచమనీయం సమర్పయామి - యజ్ఞోపవీతార్థం అక్షతాం సమర్పయామి - దివ్య పరిమళగన్ధా సమర్పయామి - ఆలంకరణార్థం అక్షతాం సమర్పయామి - మాల్యార్థం పుష్పాణి పూజయామి.

1 ఓమ్ సుముఖాయనమః.
2 ,, ఏకదన్తాయనమః
3 ,, కపిలాయనమః.
4 ,, గజకర్ణికాయనమః
5 ఓమ్ లమ్బోదరాయ [నమః.
6 ,, వికటాయనమః.
7 ,, విఘ్నరాజాయనమః

8 ఓమ్ గణాధిపతియే [నమః
9 ,, ధూమకేతువేనమః
10 ,, గణాధ్యక్షాయ [నమః.
11 ,, ఫాలచన్ద్రాయ [నమః
12 ,, గజాననాయనమః.
13 ,, వక్రతుణ్డాయ నమః.
14 ,, కుమారగురువే [నమః
15 ,, శూర్పకర్ణాయ [నమః.
16 ,, హేరమ్బాయ [నమః.

17 ఓమ్ స్కన్ధాగ్రజాయ [నమః.
18 ,, మూషకవాహ [నాయనమః.
19 ,, మోదుక హస్తా [యనమః.
20 ,, చామరకర్ణాయ [నమః.
21 ,, విళమ్బితసూత్రా [యనమః.
22 ,, వామన రూపాయ [నమః.
23 ,, ఈశ్వర పుత్రాయ [నమః
24 ,, వరసిద్ధి వినాయ [కాయినమః.

నానావిధ పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి - ధూపార్థం అక్షతాం సమర్పయామి - దీపార్థం అక్షతాం సమర్పయామి - నైవేద్యం సమర్పయామి - సువర్ణపు



ష్పం సమర్పయామి - తామ్బూలం సమర్పయామి - నీరాజ్ఞనందర్శయామి - మఙ్గళంభగవాన్ విష్ణుః మఙ్గళం మధుసూదనః। మఙ్గళం పుణ్డరీకాక్షో మఙ్గళం గరుడ ధ్వజః॥ నీరాంజనానన్తరం ఆచమనీయం సమర్పయామి - వక్రతుణ్డమహాకాయం కోటి సూర్య సమప్రభ। అవిఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సిద్ధితః॥ మన్త్రపుష్పం సమర్పయామి - ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి - ఛత్రంసమర్పయామి - చామరం సమర్పయామి - నృత్యంసమర్పయామి - వాద్యంఘోషయామి - సమస్త రాజోపచార శక్త్యోపచార భక్త్యోపచారపూజాం సమర్పయామి - అనయాపూజయాచ నైవేద్యేనచ భగవాన్ సర్వదేవాత్మకః మహాగణాధిపతి దేవతా సుప్రీతా సుప్రసన్నా వరదాభవన్తు.

పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ—————స్వామి పూజాంకరిష్యే. శ్రీమత్సద్గురు —————— స్వామినశ్చరణార విన్దాభ్యాం నమోనమః ధ్యాయామి - ఆవాహయామి - ఆసనం సమర్పయామి - హస్తయోః అర్ఘ్యంసమర్పయామి - పాదయోర్గ పాద్యంసమర్పయామి - స్నానం

(పురుషసూక్తం)- స్నానానన్తరం ఆచమనం సమర్ప యామి - వస్త్రంసమర్పయామి - యజ్ఞోపవీతార్థం అక్షతాంసమర్పయామి - దివ్యపరిమళగన్ధాం సమర్పయామి- అలఙ్కారణార్థం - అక్షతాం సమర్పయామి - మాల్యార్థం పుష్పాణి పూజయామి - (గురుస్తోత్రములు - అష్టోత్తరములు) నానావిధ పరిమళపత్రపుష్పాణి సమర్పయామి- ధూపం ధూపమాఘ్రాపయామి- దీపం దర్శయామి- నైవేద్యం సమర్పయామి- తామ్బూలం సమర్పయామి- నీరాంజనం దర్శయామి (మన్త్రపుష్పం) మన్త్రపుష్పం సమర్పయామి - ఆత్మప్రదక్షిణ నమస్కారాం సమర్ప యామి - ఛత్రం సమర్పయామి - ఛామరం వీజయామి- నృత్యం దర్శయామి - వాద్యం ఘోషయామి - సమస్త రాజోపచార - దేవోపచార- శక్త్యోపచార-భక్త్యోపచార పూజాం సమర్పయామి - నైవేద్యేనచ భగవాన్ సర్వ దేవాత్మకః శ్రీ..................స్వామి సుప్రీతార్థం సుప్రసన్నా వరదా భవన్తు - ఉత్తర నీరాంజనం దర్శయామి॥

పైచెప్పబడ్డ లోకములకు శాంతిని కలిగించుటకై శ్లోకరూపమైన పాఠములు కల్పించి యున్నారు. వాటిలో



కొన్ని శ్రాద్ధమునకును అనగా అశుభకార్యములకున్ను మరికొన్ని శుభకార్యములకున్ను ఉపయోగింప బడు చున్నవి.

## శ్రాద్ధము చేయవలసినది

## మృత పిత్రులకా లేక జీవిత పిత్రులకా ?

ఇంకను పితృలోకవాసులకు మనకువలె స్థూలశరీరము లుండవు. వారు సూక్ష్మశరీరములుకలవారు. అట్టి సూక్ష్మ శరీరులకు స్థూలాహారము లెట్లుచెల్లును. ఒకవేళ భూలోక వాసులు పితృలోకవాసులకై సంవత్సరమున కొకతూరి సమర్పించునట్టి ఈ స్థూలాహారములు పోష్టుమూలములో పితృలోకమునకు ఎట్లు పోయిచేరగలదు. వారెట్లు భుజింప గలరు. సాధారణముగా ఆకలికొన్న వానిని ఒకనిని ఒక చోట కూర్చుండబెట్టి మరి యొకనిని పది అడుగుల దూర మున కూర్చుండబెట్టి, అట్టివాని ఆకలికై సమీపమున యున్నవారికి ఆహారపదార్థములుంచిన యెడల, పదిఅడుగుల దూరములో నున్నవానికి ఆకలి తీరునా. అట్లు ఆకలి

తీరినయెడల పితృలోకవాసులకు కూడా ఆకలి తీరునని నమ్మవలసినదే.

## మన మనుభవించునట్టి సుఖదుఃఖములకు కారణములు నవగ్రహములా లేక ప్రారబ్ధకర్మ ఫలమా?

ఇదియునుగాక మనము ప్రత్యక్షముగా లోకఅనుభవమునుబట్టి చూడగా ఒకరి కొకరికి మొదట మిత్రత్వము కలిగి,పిమ్మట శత్రుత్వము కలుగుట స్వాభావికము. అట్లుండగా, మనమెన్నడును స్నేహము లేనివారితో నిష్కారణముగా మనకును గ్రహములకున్న స్నేహము లేనిదే విరోధమెట్లు సంభవించును. కాబట్టి మన మనుభవించు సుఖదుఃఖములకు ప్రారబ్ధ ఫలములనియే నిరూపింప వలసియున్నది.



# సంకల్పము.

## గురుధ్యానం.

శుభాభ్యాం శుభతిథౌ శోభనముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వన్తరే కలియుగే ప్రథమ పాదే జమ్బూద్వీపే భరతవర్షే భరత ఖణ్డే అస్మిన్వర్తమానే వ్యావహారిక చాన్ద్రమానేన ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే.......... సంవత్సరే..........అయనే..........ఋతు. .......... మాసే.........పక్షే.........తిథౌ.........వాసరః......... వాసరస్తు.........వాసరయుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ——————స్వామి ముద్దిస్య—————————స్వామి ప్రీత్యర్థం యావచ్ఛక్తి ధ్యాన మావాహనాది సమస్త షోడశోపచార పూజాంచ కరిష్యే.

తదఙ్గత్వేన కలశపూజాంకరిష్యే, కలశం గన్ధ పుష్పాక్షితై రభ్యర్చ.

వీనిభావము.—

శుభమునకు శుభతిథియందు శుభ ముహూర్తమందు మొదటి బ్రహ్మ మొదలు రెండవపరార్థమందు శ్వేతవరాహకల్పమందు వైవస్వత మన్వంతరమందు కలియుగంబున ప్రథమపాదమందు జంబూద్వీపములో భరతవర్షమున భరతఖండమందు అగుచుండెడి వర్తమాన వ్యావహారిక చాంద్రమానమున ప్రభవాది షష్టి సంవత్సర మధ్యయందు———సంవత్సరమందు——...అయనమందు——ఋతువునందు——మాసమందు —— పక్షమందు తిథియందు——దివసమందు శుభనక్షత్ర శుభ యోగ శుభకరణ ఈ గుణ విశేషములతోకూడిన దివసమందు శుభతిథియందు శ్రీ——స్వామిని ఉద్దేశించి స్వామి ప్రీతికొఱకు యావచ్ఛక్తి ధ్యానము ఆవాహనాది సమస్త షోడశోపచార పూజాదికములను చేయుచున్నాను.

అద్దాని అంగమైన కలశపూజను చేయుచున్నాను.

## కలశస్యోపరి హస్తనిధాయ.

శ్లో॥ కలశస్యముఖేవిష్ణుః కణ్ఠేరుద్రస్సమాశ్రితః।
మూలేతత్రస్థితోబ్రహ్మా మధ్యేమాతృగణాస్స్మృతాః।



కుక్షౌతుసాగరాస్సర్వేసప్తద్వీపావసున్ధరా। ఋగ్వేదోథయజుర్వేద స్సామవేదో హ్యథర్వణః।అఙ్గైశ్చసహితా స్సర్వే కలశామ్బు సమాశ్రితాః। ఆయాన్తు దేవపూజార్థం దురితక్షయకారకాః। గఙ్గేచ యమునేచైవ గోదావరి సరస్వతి। నర్మదాసిన్ధుకావేరి జలేస్మిన్ సన్నిధింకురు.

కావేరీ తుఙ్గభద్రాచ కృష్ణవేణీచ గౌతమ।
భాగీరథీ మహానద్యాః పఞ్చగఙ్గాః ప్రకీర్తితాః॥

కలశోదకేన పూజాద్రవ్యాణి, దేవం, ఆత్మానం సంప్రోక్ష్య ఆదౌనిర్విఘ్నేనపరిసమాప్త్యర్థం మహాగణాధిపతి పూజాం కరిష్యే.

అనగా- కలశముయొక్క పైభాగమందు చేతులనుంచి

శ్లో॥ కలశస్య——సన్నిధింకురు, భావము—— కలశముయొక్క ముఖమందు-విష్ణువును, కంఠమందురుద్రుడును, మూలమందు బ్రహ్మయును,మధ్యమాతృ గణములును, కుక్షియందు సమస్త సముద్రములును,సప్తద్వీపములును, భూమియును, ఋగ్వేద యజుర్వేద సామాథర్వణ వేదములును, షడంగములును, సర్వమును, కలశపీఠకమందు ఆశ్రయించియున్నవి. దురితక్షయ కారకములైన గంగ యమున గోదావరి సరస్వతి నర్మద సింధు కావేరీ తీర్థ

ములు దేవపూజార్థమై అగుగాక. జలమందు సన్నిధి చేయుడు.

భా వే—కీర్తితాః॥ కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమీ భాగీరథి ఈమహానదులు పంచగంగలని ప్రసిద్ధి వడసియున్నది, కలశోద—కరిష్యే కలశోదకము చేత దేవుని అత్మ్యానము ప్రోక్షించి మొదటినుంచి నిర్విఘ్నముగా పరిపూర్తియగుటకు మహాగణాధిపతి పూజను చేయుచున్నాను.

మహాగణపతిస్తోత్రము సంకల్పము మొదలగు శ్లోకములలోని యర్థమును చూడగా మనయిండ్లలో సామాన్యముగా మాటలాడునట్టి పదములుగానే యున్నవి. అవి శ్లోకరూపముగా యుండబట్టి మనము భ్రమించుచున్నాము గాని వేరు కాదు. అట్టి పొడి మాటలవలన ప్రయోజన మేమి యుండదు. ఇటులనే ఆర్యుల యభిప్రాయము.

సంవత్సరములు, అవయనముల పేర్లు, మొదలగునవి.

సంవత్సరములు ౬౦.— ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ, భవ, యువ, ధాతు, ఈశ్వర, బహుధాన్య, ప్రమాది, విక్రమ,



విషు, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్తు, సర్వధారి, విరోధి,వికృతి, ఖర, నందన,విజయ, జయ, మన్మథ, దుర్ముఖి, హేవిళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ,శుభకృతు, శోభకృతు, క్రోధి, విశ్వావసు, పరాభవ,ప్లవంగ, కీలక,సౌమ్య, సాధారణ, విరోధికృతు, పరీధావి, ప్రమాదీచ, ఆనంద, రాక్షస, నళ, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్ముఖి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ.

అయనములు ౨.—ఉత్తరాయన, దక్షిణాయనము.

ఋతువులు ౬.—వసన్త, గ్రీష్మ, వర్ష. శరత్. హేమన్త శిశిర.

మాసములు ౧౨.—చైత్ర - వైశాఖ - జ్యేష్ఠ- ఆషాఢ- శ్రావణ- భాద్రపద- ఆశ్వ- కార్తి, మార్గశిర-పుష్య. మాఖ- ఫాల్గుణ.

పక్షములు ౨.—బహుళం=కృష్ణపక్షం = పౌర్ణమి వెనుక-శుద్ధం=శుక్లపక్షం=అమావాస్య వెనుక.

తిథులు ౧౫.—ప్రథమ-ద్వితీయ- తృతీయ- చతుర్థి- పంచమి-షష్ఠి- సప్తమి- అష్టమి - నవమి - దశమి - ఏకా

దశి-ద్వాదశి - త్రయోదశి - చతుర్దశి - అమావాస్య లేక పౌర్ణమి.

వాసరములు 7.—భాను, ఇన్దు, భౌమ, సౌమ్య, గురు, భార్గ, స్థిర.

ఆకాశములోనుండి రాత్రులలో నక్షత్రములు రాలి పడునట్లుగా కనుపడెడివి, నక్షత్రములు కావు, అవి ఉల్కలనబడును. అవి గాలిలో తిరుగుచుండు సన్నని ప్రమాని దువ్వలు. ఆ సన్నని దువ్వలు ఒకటి కొకటి ఎదురుపడి రాసుకొనుటవల్ల ఏర్పడెడు అగ్ని. అది కొంతదూరము వరకు రగులుచునే పోయి ఆరిపోవుచున్నది. ఈ నిజ స్థితిని తెలియక పామరులు చెప్పునదేమన, అట్లు పడెడి ఉల్కలను ఎవరైనను రాజులు మొదలగు గొప్పవారు చనిపోయిన ఎడల, అట్టివి రాలి పడుచున్నవని కల్పించియున్నారు. అది తప్పు అభిప్రాయము.

పైచెప్పబడ్డ లోకాదులను గురించి కొందఱు వేదశాస్త్రిములకు విరుద్ధముగా గ్రహములను పురుషులనియు, వారికి, భార్యాపుత్రాదులు గలరనియు, భూలోకమునకు దిగివచ్చిరనియు, వింతమైన మిథ్యాకల్పనలను కల్పించి



పురాణ నామములను ధరింపచేసి వ్రాసియుంచిన కథలను గురించి మన మేమని యూహింప వలయునో పాఠకులే యోచింప వచ్చును.

# నవగ్రహ శాంతి విధానము.

నవగ్రహశాంతికి ధాన్యములు మొదలగునవి.

శుభగ్రహాదులు అశుభగ్రహాదులు అనియును, అధి దేవతలు - అధిదేవతల వాహనములు - దిక్కులు - జాతులు - రంగులు అవయవములు - ఆకృతులు - జాతులు - భాషలు (చర - స్థిర - ఉభయ) రాసులనియు, (రాజస - తామస - సాత్విక గుణములనియు, ఆసనములు - లోహములు - రత్నములు - ధాన్యములు - పుష్పములు- సమితలు - ఆహారము (ఉష్ణము లేకశీతము), రుచులు - వాహనములు - నాడులు (పిత్త-వాత-శ్లేష్మ), భూతములు (పృథ్వీ మొదలగు పంచభూతములు), పార్వ - నవరంధ్రములు - ధూప - దీప - వస్త్రములు, మొదలగునవి చెప్పబడియున్నది.

నవగ్రహశాంతి విధానమును చేయుమని చెప్పు చున్నారు గదా? అది నవగ్రహములకు శాంతిని కలిగిం

చుట ఎంత మాత్రమును గాదు. ఏలనగా నిర్జీవ లోకములకు శాంతి అగత్యములేదు గాని, వీచునట్టివాయువులోని దుర్గంధ దోషములను హరించుటకై చేయునట్టి పద్ధతి యని వేదములో చెప్పబడియున్నది. అందువల్ల భౌతికలాభములు కలుగును. అనగా వర్షము మొదలగు సుఖములు కలుగుటకు హేతుకరము.

## గ్రహణములు.

చంద్రుడీ గ్రహపాత స్థానములయందున్నప్పుడె సూర్యుడును, భూమియును, చంద్రుడును ఏక సమరేఖలో నుండుట సంభవించును. మరియు చంద్రుడు గ్రహపాత స్థానములందు పూర్ణిమఅమావాస్యలయందే యుండును.

సూర్యునినుండి బయలుదేరిన తేజఃకిరణములు, సరళరేఖలుగా అన్నివైపులను వ్యాపించి కాంత్యభేదములగు భూమిమీదను, చంద్రునిమీదను పడుటచేత ఛాయల నేర్పఱచును. భూమియు, చంద్రుడును గోళములగుట చేతవీనివలన నేర్పడుఛాయ, శంఖాకారముగా(Conical) మొదట వెడల్పుగానుండి పోనుపోను సన్నమయి చివరకు మొనలు దేలుచున్నవి. మరియు 68-వ ప్యారాలో చూపి



నట్లు ఛాయయు, ఖండచ్ఛాయయు నేర్పడుచున్నది. ఇట్లు భూమివలన నేర్పడిన ఛాయయందు చంద్రుడు ప్రవేశించినప్పుడు చంద్ర గ్రహణమును చంద్రునివలన నేర్పడిన ఛాయయందు భూమి ప్రవేశించినప్పుడు సూర్య గ్రహణమును గలుగుచున్నవి.

సూర్యగ్రహణము — పూర్ణగ్రహణము, పక్షగ్రహణము, కంకణగ్రహణము, అని మూడువిధములు.

## చంద్రగ్రహణము.




భూచ్ఛాయయందు చంద్రుడు ప్రవేశించుటచే, చంద్రగ్రహణము కలుగునని చెప్పియుంటిమి. కాబట్టి సూర్యునికిని చంద్రునికిని సరిగా మధ్యను భూమియుండవలయునని

స్పష్టమేకదా. పూర్ణిమనాడు మాత్రమే సూర్యునికిని చంద్రునికి నడుమ భూమివచ్చును. అందుచేత పూర్ణిమనాడు మాత్రమే చంద్రగ్రహణము కలుగుచున్నది. మరియు భూకక్ష్యయు, చంద్రకక్ష్యయు, నొకటేయెత్తున లేక సుమారు 5 అంశలు లోక దానిపై నొకటి వంగియుండుటచేత, పూర్ణిమనాడు చంద్రుడు భూచ్ఛాయకు మీదగాని క్రిందగానియుండి భూచ్ఛాయలో ప్రవేశించి పోవుటచేత ప్రతి పూర్ణిమనాడును చంద్ర గ్రహణము కలుగుటలేదు. ఈ రెండుకక్ష్యలు కలిసిన గ్రహపాతము నందుగాని దానికి సమీపమునగాని చంద్రుడువచ్చి భూచ్ఛాయలో ప్రవేశించుట చేత చంద్ర గ్రహణ మేర్పడు చున్నది.

చంద్రుడు గ్రహపాత స్థానమునకు చాలా సమీపమునయుండి, భూచ్ఛాయలో పూర్ణముగా ప్రవేశించుటచేత, పూర్ణగ్రహణమున గ్రహపాత స్థానమునకు కొంత దూరమునను కొంతభాగముమాత్రమే ఛాయలో ప్రవేశించుటవలన పక్షగ్రహణమును ఏర్పడుచున్నది. మరియు చంద్ర గమనము పడమటనుండి తూర్పున కగుటచే



చంద్రుడు పడమటిభాగమున ఛాయలో ప్రవేశించి తూర్పుభాగమున ఛాయను విడుచుచున్నాడు, ఆకారణముచేత చంద్రునికి తూర్పున గ్రాసమును పడమట విడుపును కలుగుచున్నది.

## సూర్యగ్రహణము.




సూర్యునికిని భూమికిని సరిగా మధ్యను చంద్రుడు వచ్చుటచేత నేర్పడు చంద్రచ్ఛాయయందు భూమి ప్రవేశించుటచే సూర్యుడు గోచరమై సూర్యగ్రహణ మేర్పడుచున్నది. అమావాస్యనాడు మాత్రమే చంద్రుడు సూర్యునికిని భూమికిని మధ్యనుండును. అయినను భూచక్ర చంద్రకక్షతో సమానమైన యెత్తునలేక ను అంశలు వంగియుండుటచే ప్రతిఅమావాస్యయందును

ఏర్పడు చంద్రచ్ఛాయకు యెత్తుగనో తక్కువగనో భూమి యుండి ఛాయలో చొరకపోవుటచే ప్రతిఅమావాస్య యందును, సూర్యగ్రహణము సంభవింపదు. భూకక్ష యు, చంద్రకక్షయు కలిసియున్న గ్రహపాతక స్థాన మందుగాని దానికిసమీపమునగాని భూమియుండి చంద్ర చ్ఛాయలో ప్రవేశింప గలిగినప్పుడే సూర్యగ్రహణము సంభవించు చున్నది.

కంకణ గ్రహణ రూపమును, పక్షగ్రహణ రూపము లును దిగువ చూపబడియున్నవి.

## కంకణ. పక్ష గ్రహణముల రూపములు.



చంద్రుడు పడమరనుండి తూర్పునకు సంచారము చేయుచుండుటచేత, పడమటి వైపున భూచ్ఛాయలో



ప్రవేశించి, సూర్యుని పడమటి భాగమును మరుగుపడుట చేతను, తూర్పున భూచ్ఛాయను విడిచి సూర్యుని తూర్పు భాగము కనబడుటచేతను, సూర్యునికి పడమట గ్రాస మును, తూర్పున విడుపును గలుగుచున్నవి.

## గ్రహణకాలమున సముద్రస్నాన మవశ్యమా?

ఇట్టి గ్రహణములను గురించి బ్రాహ్మణులు చెప్పు నదేమనగా, రాహువు కేతువు లనబడు సర్పాకృతితో శనైశ్చరరూపముగా పరిణమించి భగవంతుని పీడించు చున్నవని చెప్పుచున్నారు, అందుకు హిందువులందరును గ్రహణముపట్టి విడిచినపిమ్మట సముద్ర స్నానము ముఖ్య ముగా ఆచరించవలయునని లోకులకుబొంకి, అట్టిసమయ ములో దానముల మూలముగా ద్రవ్యమును లాగుకొని సద్గతికలుగునని కల్పనచేసి ధనమార్జించుచున్నారు. ఇట్టి యాచక చక్రవర్తులు లోకులను మోసపరచుచున్నారు. అట్లు లోకులను వంచించి ద్రవ్యమును లాగుకొనుట పాప

కార్యముగా నున్నది. ఇందులకుకూడా మనుస్మృతిలో శిక్షలు విధింపబడి యున్నవి.

దీనిని వివరము తెలియగోరువారు మ-రా-రా-శ్రీ, వయినంపాటి నారసింహంగారు, బి. యే. గారిచే వ్రాయఁబడిన భౌతిక శాస్త్రములో చూడనగును. ఇది వారి గ్రంథ ప్రకటనగా యిచట వ్రాయబడినది.

ఇట్లు.

టి. సి. రా.

*



స్వయంవర వివాహము:— దమయంతి - నలమహారాజు.



ఉదాహరణముగా:—

## శ ని లో క ము.



8. ఉపగ్రహములు కలది. (ఉప గ్రహములు అనగా చంద్రులు).

---

## బ్రా హ్మ ణ ల క్ష ణ ము.

శ్లో॥ అధ్యాపనమధ్యయనం యజనం యాజనంతథా ।
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్॥
మను. అ. ౧. శ్లో. ౮౮.

బ్రాహ్మణుడు వేదము చదివియుండవలయును. దాని ని పరుల కుపదేశింపవలయును. పంచ మహా యజ్ఞములు

చేయవలయును. చేయించవలయును, దాన మియ్య వల యును, పుచ్చుకొనవలయును.

బ్రాహ్మణ శబ్దము, కులమునకు సంబంధము కలి గింపదు గాని గుణమునకు సంబంధించి యున్నది. మీరు శరీరమే బ్రాహ్మణుడని ప్రమాణములు చూపలేరు, సృష్టిలో కలిగినవారిలో ఎట్టివారియందు ఉత్తమ స్వభావ లక్షణములు కలిగియుందురో అట్టివారు మాత్రము బ్రాహ్మణు లనబడుదురు. మరియు లోకులకు సహాయ పడువారు అనగా డబ్బు మొదలగు సహాయముచేయువారు మాత్రము నిజమైన బ్రాహ్మణులు. లోకులకు ఏవిధమైన సహాయము చేయక వారినుండి మోసముచేసి శ్రాద్ధ ములు, సంతర్పణలు, సమారాధనలు, మొదలగువాటిని చేయించి డబ్బును లాగుకొనుట పాపకార్యముగానున్నది. కాబట్టి అట్టి దానములను తీసుకొనకయుండుట మేలు. అట్టి అపాత్ర దానములు పట్టువానికి మనస్మృతిలో శిక్షలు కూడ విధింపబడి యున్నవి.

---

# (1) సంజ్ఞా వివరణ పట్టిక.

### 1. ఋగ్వేదము.

మం = మండలము.
సూ = సూక్తము.
మం = మంత్రము.

### 2. యజుర్వేదము.

అ -- అధ్యాయము.
మం = మంత్రము.

### 3. సామవేదము.

ఉ = ఉత్తరార్చిక.
ఖం = ఖండము.
మం = మంత్రము.

### 4. అథర్వవేదము.

కాం = కాండము.
సూ = సూక్తము.
వర్గ = వర్గము.
అను = అను వాకము.
ప్ర = ప్రకాటము.
మం = మంత్రము.

# (2) చిత్రపటములు.



# 4. అనుక్రమణిక.

అంజలీఆహుతి = ఓం భగాయ స్వాహా ఇదం భగాయ, ఇదన్నమమ.

మార్గదర్శకులు = ముందునడచి చూపెట్టువారు.

స్వస్తివాచకము=అగ్నిమీళే మొదలగుమంత్రములు,31.

శాంతి=శన్నీ, ఇంద్రాగ్నీ మొదలగు 19+9=28 మంత్రములు.

అగ్న్యాదానవిధి=నిప్పుముట్టించిచెప్పవలసినమంత్రములు

వ్యంజనము = విసనకఱ్ఱ.

కాష్టము = సమితలు.

ఆహుతులు=నేతిని యజ్ఞకుండములో మంత్రములు చెప్పి పోయుట.

ఆజ్యాహుతి=నేతిని యజ్ఞకుండములో పోయుట.

స్విష్టికృత హోమము = ప్రాయశ్చిత్తమునకైయున్న, కోరికలకైయున్న, ఇచ్చెడు హోమములు.

ప్రాజాపత్యాహుతి = హృదయములో ధ్యానించుచు ఇచ్చెడు ఆహుతులు.

అష్టాజ్యాహుతి = ఎనిమిది తడవలు నేతితో ఇచ్చేడు ఆహుతులు.
ఆచమనము = నీళ్ళను చిలకరించుట.
వామహస్తము = ఎడమచేయి.
మధుపర్కము = పెరుగులో నేతినికలిపిన ద్రవ్యము.
ప్రాశనము = తినడము.
అంగస్పర్శ = శరీరమును తాకుట.
పవస్త్రము = ఆపది పై వేసుకొనెడిపంచె, అనగా జందెమువలె వేసుకొనునది.
అముఖ = ఆ యా దేశవాసులు.
అధోవస్త్రము = పురుషుడు దిగువకట్టుపంచె.
పేలాలు = బొరుగులు.
సకార్యకర్త=ఆకార్యములు జరిపించెడువాడు.
ఆధారావాజ్య భాగాహుతులు = నలుదిక్కులుఇచ్చేడు ఆహుతులు.
జయాహోమము=13 మంత్రములతో ఇచ్చేడుఆహుతులు
అభ్యాతన హోమము = 13 మంత్రములతో నేతితో ఇచ్చేడు హోమములు.
సన్నికలు = మిరపకాయనూరెడు క్రిందిరాయి.



దోసిలి = అరచేతి నిండగా ఎత్తుట.
లాజాలు = ఇంద్రియము గడ్డకట్టుటకై చేసెడిపద్ధతి.
ఆహుతి = అగ్నిలో వేయుట.
ఏకాంత స్థలము = ప్రత్యేకముగా నుండుచోటు.
కేశము = వెంద్రుకలు.
ప్రోక్షించుట = చిలకరించుట.
అవలోకించి = చూచి.
స్కంధము = చెట్టుబోదె.
స్పర్శచేసి = తాకి లేక అంటి.
విశ్రామము = ఊరికెయుండుట.
అగ్న్యాధానము = అగ్నిముట్టించుట,
సమిత్తాదానము = హోమమునకు ఉపయోగించునట్టి సన్నని పుడకలను అగ్నిగుండములో వేయుట.
వధువు = పెండ్లికూతురు.
వరుడు = పెండ్లికొడుకు,
ధృవము = నక్షత్రము.
మస్తకము = తల.
హస్తము = చేయి.
స్థాలీపాకము = వంటి పాత్రములో వండిన అన్నము.

---

